Photo by S. H. Kotak



బహుమతి
పొందిన వ్యాఖ్య

అక్కయ్య చేతిలో ఆకాశదీపాన్ని...

పంపినవారు :
ఎం. జి. కాంతమ్మ - అదోని

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఇంద్రజాలం, చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ,
వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో అకర్షణలు.










సన్‌లైట్

సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

S. 242-50 TL

రెండు రూపాయిలు మాత్రమే!



## మెట్-స్పీడ్-బోట్

★ రెండు రంగుల డిజైను.

★ యంత్రపరికరములు లేక, మైనపువత్తి సహాయంతో నీటిపై నడచును.

★ బిడ్డలకు ఆనందము నిచ్చును.

★ బోట్‌తోకూడ నీటిగొట్టము, మైనపు వత్తి, రంగులపెట్టె—అన్ని చోట్ల దొరకును.

లేదా, మాకు నేరుగా మనియార్డరు పంపండి :-

బాపట్ బ్రదర్స్

295, బజారు రోడ్డు, బొంబాయి - 20.

"గే మిలర్స్" వారి ఆటబొమ్మలు




## సపట్
## లోషన్ & మలాము




గత 50 సంవత్సరాలకు పైగా—తామర, గజ్జి, చిడుము వ్యాధులకు అమోఘమైనదని ప్రసిద్ధి గాంచినది.

**సపట్ అండ్ కో., బొంబాయి-2**

ఆంధ్రాకు ఏజంట్లు :

ది ట్రేడ్ ప్రమోటింగ్ కార్పొరేషన్

విజయవాడ - 2

RPO




## లిలీస్
# మాల్టో
బిస్కతులు

బిడ్డలకు ప్రియమైనవి.

**LILY BISCUIT CO. PRIVATE LTD., CALCUTTA-4**



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అధికారంవెంట నైతికపతనంకూడా ఉంటుంది. పాలకుల
నైతికపతనం ప్రజలయొక్క పతనానికి దారితీస్తుంది. అందు
చేత పాలకులు అనుక్షణం ఆత్మపరిశీలన చేసుకుంటూ ఉండాలి.
అయితే ఆత్మపరిశీలన ఒక్కటే చాలదు. ఎందుచేతనంటే
ఎవరి తప్పులు వారికి అంతబాగా తెలియవు; ఇతరులకు బాగా
తెలుస్తాయి. కాని అధికారంలో ఉండేవారి చుట్టూ ఆశ్రితు
లుంటారు; వారు స్వలాభంకోసం పాలకులను అస్తమానమూ
మెచ్చుకుంటారు. ఈ ఇబ్బందులనన్నిటినీ జయించి పాలకులు
తమ లోపాలను తెలుసుకుని, దిద్దుకోవాలి.

"ఎవరు గొప్ప?" అన్న జాతక కథలో మనకీ నీతి గోచరిస్తుంది.
ఈ కథలో, కాశీరాజు తన లోపాలేవో తెలుసుకోగలందులకై
రాజభవనం దాటి, రాజధానికూడా దాటి మారువేషంలో రాజ్య
పొలిమేరుదాకా ప్రయాణంచేస్తాడు. కోసలదేశాన్ని ఏలే మల్లిక
మహారాజుకూడా ఇలాటి ఉద్దేశంతోనే మారువేషంలో తన
రాజ్యమంతా తిరుగుతాడు. వీరిద్దరూ సరిహద్దువద్ద తారసిల్లి
నప్పుడు కోసలదేశపు రాజు కాశీరాజువద్ద తనకన్న గొప్పగుణాలున్న
సంగతి తెలుసుకుని, తన లోపాన్ని సవరించుకో గలుగుతాడు.

సంపుటి 19 డిసెంబరు 1956 సంచిక 6

CHITRA

# అట్టమీది బొమ్మ

పాండవులు అరణ్యావాసంచేసే కాలంలో మార్కండేయ మహాముని వారి వద్దకు వచ్చి అనేక కథలు చెప్పాడు. ఒకసారి ధర్మరాజు, "మహాత్మా, పరమ పతివ్రత అయిన ద్రౌపది మాతోబాటు ఇన్ని కష్టాలు పడుతున్నదిగదా! పూర్వం ఏ పతివ్రత అయినా ఇలా కష్టాలు పడటం జరిగిందా?" అని అడిగాడు. అప్పుడు మార్కండేయుడు సావిత్రీ సత్యవంతుల కథను చెప్పసాగాడు.

పూర్వం మద్రదేశాన్ని అశ్వపతి అనే మహారాజు ఏలుతూ ఉండేవాడు. ఆయనకు పిల్లలు లేరు. అందుచేత ఆయన విడవకుండా పద్దెనిమిదేళ్లపాటు సావిత్రీదేవిని హోమార్చనలతో సహా ఆరాధించాడు. సావిత్రీదేవి ప్రత్యక్షమై, "రాజర్షీ, నీ అరాధనకు మెచ్చాను. ఏం వరం కావాలో కోరు!" అన్నది.

దానికి అశ్వపతి, "తల్లీ, నాకు కొడుకులను ప్రసాదించు!" అని కోరాడు.

"నీ ఉద్దేశం ముందే ఎరిగి ఉండటంచేత నేను బ్రహ్మవద్దకు వెళ్లి నీ విషయం మాట్లాడాను. నీకు ఒక్క కుమార్తెను మాత్రమే ఇవ్వటానికి ఆయన సమ్మతించాడు. పెద్దలిచ్చినది భక్తితో స్వీకరించటం మంచిది. అందుచేత నీవు ఒక్క కుమార్తెతో తృప్తిపడు," అన్నది సావిత్రీదేవి.

ఆ తరవాత అశ్వపతి భార్య అయిన మాళవి గర్భవతి అయి సకాలంలో ఒక ఆడపిల్లను కన్నది. సావిత్రీదేవి వరాన పుట్టిన పిల్ల కావటంచేత అశ్వపతి తన కుమార్తెకు సావిత్రి అని పేరుపెట్టుకున్నాడు. సావిత్రి క్రమంగా పెరిగి పెద్దది అవుతున్నకొద్దీ ఆమె అందమూ, తేజస్సూ చూసి ప్రజలు, ఆమె మానవ మాత్రురాలు కాదనీ, దేవతే మానవరూపంలో అవతరించిందనీ అనుకునేవారు. ఆమెకు వివాహంచేసుకునే వయసు వచ్చినప్పటికీ ఏ రాజకుమారుడుకూడా, ఆమెను పెళ్ళాడతానని ముందుకు రావటానికి సాహసించలేక పోయాడు.

ఇలా ఉండగా ఒకనాడు సావిత్రి స్నానంచేసి, సావిత్రీదేవికి హోమం చేసి, తండ్రిదగ్గిరికి వచ్చి ఆయన విచారంగా ఉండటం గమనించి కారణం అడిగింది. "అమ్మా, నీ వివాహంగురించి నేను చింతిస్తున్నాను. ఒక్క రాజ కుమారుడైనా నిన్ను పెళ్ళాడటానికి సాహసించకుండా ఉన్నాడు. నీకు తగిన భర్తను నీవైనా వెతకిచూసుకో. నిన్ను అతనికిచ్చి పెళ్ళిచేసి నా కర్తవ్యం నెర వేర్చుకుంటాను. యుక్తవయస్సు వచ్చిన కుమార్తెకు పెళ్ళిచేయలేదన్న నింద నాపై రాకుండా చూడు!" అన్నాడు అశ్వపతి.

# ఎవరికి తగినట్టు వారికి!

కాశీనగరంలో ఒక వర్తకుడికి నలుగురు కొడుకు లుండేవారు. వారొకనాడు అడవికేసి షికారు పోతూండగా, ఒక వేటగాడు బండిమీద వేటమాంసం వేసు కునివస్తూ ఎదురుపడ్డాడు.

"ఒరే, నాకు కొంచెం మాంసం ఇవ్వరా!" అని పెద్దవాడు వేటగాణ్ణి అధికారపూర్వకంగా అడిగాడు. వేటగాడు జంతువుచర్మం కొంచెం కోసి ఇచ్చాడు.

రెండోవాడు, "తమ్ముడూ, నాక్కూడా కొంచెం మాంసంపెట్టు," అన్నాడు. వేటగాడు తొడమాంసం కోసి ఇచ్చాడు.

మూడోవాడు, "నాయనా, నాక్కూడా మాంసంపెట్టు!" అన్నాడు. వెంటనే వేటగాడు గుండెకాయ ఒకటితీసి ఇచ్చాడు.

నాలుగోవాడు, "మిత్రమా, నాక్కూడా మాంసం పెట్టవా?" అని అడి గాడు. వెంటనే వేటగాడు, "స్నేహితుడా, నీ యిల్లెక్కడ? చెప్పు, నా బండీలో మాంసమంతా మీ ఇంటికి చేర్చుతాను! ఇదంతా నీదే!" అన్నాడు.

"మా నలుగురిలో నువ్వింత వ్యత్యాసం చూపా వెందుకు?" అని పెద్ద వాడు అడిగాడు.

"ఎవరికి తగినట్టు వారికిచ్చాను, వ్యత్యాసం మీ మాటల్లోనే ఉంది, నాలో లేదు!" అన్నాడు వేటగాడు.

వాళ్లు సంతోషించి వాణ్ణి తీసుకుపోయి, తమ నౌకరుగా పెట్టుకున్నారు.






# ఎవరు గొప్ప?

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు కాశీరాజు కుమారుడై జన్మించాడు. ఆయన తక్షశిలకువెళ్లి పదహారేళ్లు నిండేలోపుగానే సమస్త శాస్త్ర పురాణాలన్నీ చదివేశాడు. తరవాత తండ్రి చనిపోగా ఆయన కాశీదేశానికి రాజయి, ధర్మం ఏ మాత్రమూ తప్పకుండా రాజ్యపాలన చేయసాగాడు.

ఆయన పరిపాలనలో ప్రజలు ఎట్టి బాధలూ, అరిష్టాలూ, అన్యాయాలూ, అక్రమాలూ లేక సుఖజీవనం గడుపుతూ రావటంచేత, న్యాయస్థానం పూర్తిగా పాడుబెట్టినట్టయి పోయింది. ఎన్నిఏళ్లు గడిచినా రాజాస్థానానికి ఒక్కడూ రాడు, ఫిర్యాదు చెయ్యడు. ప్రజలలో ఎట్టి ఆందోళనా లేకపోవటంచేత రాజుకు తనవల్ల ఏ లోపాలు జరుగుతున్నదీ, తనను గురించి ప్రజలేమనుకుంటున్నదీ తెలియలేదు. కనీసం వ్యాజ్యాలమీద ఆస్థానానికి వచ్చిపోయేవారున్నప్పటికీ వారిద్వారా రాజు తన లోపాలు తెలుసుకోవటానికి వీలుండేది; కాని, ఆస్థానంకేసి తొంగిచూసేవాళ్లే కరువయారు.

అందుచేత ఒకనాడు రాజు తన రథం ఎక్కి కాశీ నగరమంతా తిరుగుతూ, కనిపించినవారినల్లా, "నా పరిపాలనలో మీకేం లోపాలు కనిపించాయి?" అని అడగసాగాడు. కాని ఎంతమంది నడిగినా ప్రతి ఒక్కరూ, "మేము తమ పరిపాలనలో చాలా సుఖంగా ఉన్నాం, మహారాజా! మాకు ఏ లోపమూ కనిపించటంలేదు!" అని చెబుతూ వచ్చారు.

అప్పటికీ రాజుకు తృప్తి కలగలేదు. ఆయన తన రాజలాంఛనాలన్నీ తీసివేసి, సామాన్యుడి అవతారంలో రథంమీద నగరం దాటి పల్లెపట్టులవెంట ప్రయాణం చేస్తూ, తనను గురించి ప్రజలు ఏమను



కుంటున్నారో వినటానికి పూనుకున్నాడు. ఎన్ని గ్రామాలకు వెళ్లినా కాశీరాజు గురించి పల్లెత్తు అక్షేపణ ఎక్కడా వినపడలేదు.

చివరకు రథం రాజ్యపు సరిహద్దు చేరుకుని సరిహద్దు బాటవెంబడి తిరిగి రాజధానికి వస్తున్నది. ఇంతలో కాశీరాజెక్కిన రథానికి మరొక రథం ఎదురువచ్చింది. రెండు రథాలూ ఒకదాన్నొకటి తప్పుకుపోయే అవకాశం లేదు, ఏమంటే, అది చాలా ఇరుకుబాట, దానికి రెండు పక్కలా ఎత్తయిన గట్లున్నాయి.

రెండు రథాలు ఒకదానికొకటి అంత దూరంలో ఆగాయి.

"మేము ముందుకు వెళ్లాలి! నీ రథాన్ని వెనక్కు తిప్పుకో!" అన్నాడు కాశీరాజు సారథి.

"నన్ను రథం తిప్పమనటానికి నీకేమి అధికారం ఉన్నది? నువే నీ రథాన్ని వెనక్కు తిప్పు!" అన్నాడు రెండవవాడు.

ఇద్దరు సారథులు వితర్కంలో పడ్డారు.

"ఈ రథంలో ఉన్న దెవరో తెలుసా? కాశీరాజుగారు" అన్నాడు కాశీరాజు సారథి.

"ఈ రథంలో ఉన్నది కోసలరాజుగారు!" అన్నాడు రెండవ రథం తోలేవాడు.

కాశీరాజ్యం ఎంత పెద్దదో, కోసలరాజ్యం కూడా అంత పెద్దదే. వయసులోనూ,



చదువులోనూ కోసలరాజైన మల్లికుడు కాశీ రాజుకు సరిసమానుడు. ఆయనకూడా మారువేషంలో తన దేశమంతా తిరిగి, తనను గురించి ప్రజలేమంటున్నారో విని, తనవల్ల తప్పులున్నట్టయితే సరిచేసుకునే ఉద్దేశంతో బయలుదేరినవాడే.

"మీ రాజుగారిలో ఆధిక్యత ఏమిటి ?" అని అడిగాడు కాశీరాజు సారథి.

దానికి కోసలరాజు సారథి వెంటనే ఈ విధంగా జవాబు చెప్పాడు.

దళహం దళహస్య ఖిపతిమల్లికో ముదునా ముదుల
సాధుంపి సాధునా జేతి అసాధుంపి అపాధునా,
ఏతాదిసో అయం రాజా మగ్గా ఉయ్యాహి సారథి ॥

[మా మల్లిక మహారాజుగారు దుష్టులకు దుష్టుడు, సజ్జనులకు సజ్జనుడు. మంచితనాన్ని మంచితనంతో బహూకరిస్తాడు, దుర్మార్గాల్ని దుర్మార్గంతో నిగ్రహిస్తాడు.]

ఇది వింటూనే కాశీరాజు సారథి ఈ విధంగా జవాబిచ్చాడు.

అక్కోధేన జినే కోధం అసాధుం సాధునా జినే
జినే కదరియం దానేన సచ్చేన అలివాదినం
ఏతాదిసో అయం రాజా మగ్గా ఉయ్యాహి సారథి ॥

[మా మహారాజు ఆగ్రహాన్ని శాంతంతో జయిస్తాడు; దుర్మార్గాన్ని సాధుత్వంతో లొంగదీస్తాడు; బహుమానాలతో లోభులను ఓడిస్తాడు; అబద్ధాలకు ప్రతిఫలంగా సత్యాన్ని ఇస్తాడు.]

కాశీరాజు రథాన్ని తోలే సారథి అన్న ఈ మాటలు వినగానే కోసలరాజు మల్లికుడు ఆత్రంగా తన రథంనుంచి దిగివచ్చి, కాశీరాజుకు ప్రణమిల్లి, "పుణ్యాత్మా, నాలోపం నాకు తెలిసివచ్చింది. దానిని సరిచేసుకుని, ఇంకా ధర్మంగా పరిపాలన సాగిస్తాను!" అన్నాడు.

తరవాత కాశీరాజు తన నగరానికి తిరిగి వచ్చి ధర్మం వెంట్రుకవాసికూడా తప్పకుండా రాజ్యపాలనచేస్తూ ఆత్మపరిశీలన చేసుకుంటూ కాలం గడిపాడు.





# రాజు - బంటు

ఒకనాడు ఒక నక్క ఆహారంకోసం అడివి అంతటా తిరుగుతూ ఉన్న సమయంలో దానికి ఒక పెద్ద సింహం కనిపించింది.

నక్క వణికిపోతూ సింహం ముందు సాష్టాంగపడి, "మహారాజా, నన్ను చంపకండి! నేను బతికిఉన్నంత కాలమూ తమకు భృత్యుడుగా ఉంటూ, ఏమి చెయ్యమంటే అదెల్లా చేస్తాను!" అన్నది.

సింహం ఇందుకు ఒప్పుకుని, నక్కను తనవెంట గుహకు తీసుకు పోయింది.

అదిమొదలు సింహం గుహలో పడుకుని ఉండేది, బయట నక్క కావలిఉండేది. ఏదైనా జంతువు కనిపించినప్పుడు నక్క గుహలోకి తొంగిచూసి, "మహారాజా, మంచి అవకాశం!" అని కేకపెట్టేది.

ఆ కేక వినగానే సింహం చివాలున లేచి, బయటికి వచ్చి, రెండు దూకులలో జంతువు మీద పడి చంపి తన కడుపు నించుకునేది. సింహం తినగా మిగిలిన ఆహారాన్ని తిని నక్క తనపొట్ట నించుకుంటూ ఉండేది.

ఈ విధంగా నక్క సహాయంతో సింహం గుహ కదలివెళ్లి వేటాడకుండానే సమస్తమైన జంతువులనూ చంపి తినసాగింది.

ఇక నక్క సంగతి చెప్పనే అవసరం లేదు. ఏనుగులూ, అడవిపందులూ, అడవిదున్నలూ మొదలైన జంతువుల మాంసం కూడా తిని అది కొద్ది రోజులకే విపరీతంగా బలిసి పోయింది.

రాను రాను నక్క తనలో తాను ఈ విధంగా అనుకోసాగింది:

"ఈ సింహం ఎక్కువేమిటి? నా తక్కువేమిటి? నన్ను సేవకుడుగా ఉంచుకుని ఈ సింహం సులువుగా అన్ని మృగాలనూ చంపగలుగుతున్నది. శ్రమ నాదీ, ప్రతిష్ఠ సింహందీ అయిపోతున్నది. ఈ సింహమే నాకు సేవకుడుగా ఉండి, జంతువులేవైనా

ఆర్. సాత్యకిరావు

వచ్చినప్పుడు నన్ను హెచ్చరించినట్టయితే, నేనుకూడా హాయిగా గుహలో విశ్రాంతి తీసుకుని, సమయం వచ్చినప్పుడు లేచివెళ్లి జంతువును చంపగలను!"

అందుచేత అది ఒకనాడు సింహంతో, "మహారాజా, నాకుకూడా మీలాగే వేటాడాలని చాలా కోరికగా ఉంది," అన్నది.

నక్క మనసులోగల ఉద్దేశం సింహానికి అర్థమయింది. తానుకూడా సింహమంత దాన్నని నక్క అనుకుంటున్నది.

"నీకు వేటాడాలని ఉంటే మనం ఉద్యోగాలు మార్చుకుందాం. కొంతకాలం నువు యజమానిగా ఉండు, నేను నీ సేవకుడుగా ఉంటాను. నువు గుహలో పడుకో, నేను బయట కాపలా ఉంటాను. ఏదైనా జంతువు కనిపించినప్పుడు నేను హెచ్చరిస్తాను, నువు వచ్చి దాన్ని చంపి తిను," అన్నది సింహం.

ఈ మాటలు విని నక్క పరమానందం చెందింది. ఎందుకంటే, తాను నోరుతెరిచి అడగకుండానే, తనకు కావలసిన ఏర్పాటుకు సింహం ఒప్పుకున్నది. "ఇప్పుడు నా వేటశక్తి మీరే చూస్తారు!" అంటూ నక్క వెళ్లి గుహలో పడుకున్నది.

సింహం గుహ బయట కాపలా కూచున్నది. బయట నక్క కూచున్నప్పుడు భయపడని అనేక జంతువులు సింహాన్ని చూసి బెదిరి పారిపోయాయి. కాని చివరకు ఒక మదించిన ఏనుగు చెట్లకొమ్మలు విరుచుకుతింటూ అటుగా వచ్చింది.

సింహం గుహలోకి తొంగిచూసి, "మహారాజా, మంచి అవకాశం!" అన్నది.

ఆ మాటకోసమే కనిపెట్టుకుని ఉన్న నక్క లేచి, గుహ బయటికి వచ్చి, పరుగు పరుగున వెళ్లి ఏనుగుమీద పడింది. మరుక్షణం ఏనుగు నక్కను తన తొండంతో పట్టుకుని, బలంగా నేలకేసి కొట్టింది.

ఒక్క దెబ్బకే నక్క కాస్తా చచ్చిపోయింది!






## 18

[వాగులోవున్న ఒక మిట్టమీద కనబడిన, సముద్రకేతుడి దొంగలను, వజ్రముష్టి హత మార్చాడు. తరవాత ఉప్పుటేరులో ఒక చిన్న ద్వీపంమీద వున్న సముద్రకేతుడి స్థావరాన్ని, శివదత్తుడూ, మందరదేవుడూ చేరారు. అక్కడ సముద్రకేతుడు బంధించి వుంచిన వారిని విడిపించి, అందరూ సముద్రకేతుడి మీద యుద్ధానికి తలబడ్డారు. తరవాత—]

వజ్రముష్టికీ, సముద్రకేతుడికీ భీకరమైన పోరు ప్రారంభమైంది. ఒకటి రెండు నిమిషాల్లో, వజ్రముష్టి కత్తిదెబ్బకు, సముద్రకేతుడి కత్తి తునాతునియలై పోయింది. వజ్రముష్టి తనచేత గల కత్తిని దూరంగా విసిరివేస్తూ, "ముష్టాముష్టిగా పోరాడి, నిన్ను హతమార్చాలనే నా కోరిక!" అంటూ సముద్రకేతుణ్ణి నడుము పట్టుకుని, చాప చుట్టలా భూమిమీదికి విసిరాడు.

ఆ దెబ్బకు దిమ్మెరపోయి సముద్రకేతుడు 'అబ్బా' అంటూ లేచేంతలో వజ్రముష్టి బలమైన చేతులు అతడి కంఠాన్ని పడిసిపట్టుకున్నై. "పాపాత్ముడా, నీ పాపాలకు యిదే ప్రాయశ్చిత్తం!" అంటూ వజ్రముష్టి అతడి కంఠాన్ని నులిమి, ఛీత్కరిస్తూ లేచి కాళ్లతో అతణ్ణి బలంగా తన్నాడు. సముద్రకేతుడిలో చలనం లేదు.

కొద్దిసేపట్లో సముద్రకేతుడి అనుచరుల్లో చావగా మిగిలినవాళ్లు బంధించబడ్డారు. అంతవరకూ యీ పోరాటాన్ని ఎలా ఆపాలో తెలియక, వింతగా చూస్తున్న హరిశిఖుడి భటులు ముందుకు వచ్చి, "ఇదంతా




"ఏమిటి ? ఎవరు మీరు ?" అంటూ శివదత్తుణ్ణి కోపంగా ప్రశ్నించారు.

శివదత్తుడు జరిగిన దంతా చెప్పి, "అయ్యా, మేము మీ మకరమండల రాజైన హరిశిఖుడికి మిత్రులుగా వుండ దలిచాం. మీరు ఒక మొసలిని దేవతగా పూజించి, రోజూ మనుష్యబలులు యిచ్చే సాంప్రదాయాన్ని గురించి విన్నాం. ఆ పిశాచిని హతమార్చగల వ్యక్తి మాలో వున్నాడు" అంటూ వజ్రముష్టిని వారికి చూపించాడు.

ఇంతలో దేవమాయి, స్వయంప్రభతో అక్కడికి వచ్చింది. ఆమె సురక్షితంగా



వుండటం అందరికీ చాలా సంతోషం కలిగించింది.

తరవాత హరిశిఖుడి భటులు శివదత్తుడి కోరికపై అతణ్ణి మకరమండలానికి తీసుకుపోయారు. హరిశిఖుడు వారికి గొప్పగా స్వాగతం యిచ్చి, "మీరు నా భటులతో చెప్పినట్టు మకరదేవతను చంపేవాడు మీలో వున్నాడా ?" అని అడిగాడు.

దానికి వజ్రముష్టి ముందుకు వచ్చి, "మహారాజా ! నేను చిన్నప్పటినుంచీ మా శమనద్వీపంలో మొసళ్లను వేటాడటం నేర్చినవాణ్ణి ! మీరు దయవుంచి ఆ మొసలి ఉన్న స్థానం నాకు చూపితే, దాన్ని కనుమూసేంతలో తుద ముట్టించగలను !" అన్నాడు వినయంగా.

వజ్రముష్టి మాటలకు హరిశిఖుడు నవ్వి, "ఆ మొసలిని మూర్ఖులైన చాలామంది దేవతగా పూజిస్తున్నారు. కాని అదంటే అందరికీ భయమే! నీవంటి మరుగుజ్జు మానవుడు దానిని హతమార్చ గలడని ఒక నమ్మకం కూడా ఉంది. మీ యజమాని అంగీకరిస్తే, నీ శక్తి సామర్థ్యాలు చూడాలని నాకు కుతూహలంగా ఉంది!" అన్నాడు.

శివదత్తుడు అంగీకార సూచనగా తల వూపాడు. తరవాత హరిశిఖుడితో విన





యంగా, "మహారాజా! ఈ మొసలి కలిగించే ఆపదలనుంచి మీ ప్రజలను మేము రక్షిస్తాం. దీనికి ప్రతిగా మీనుంచి మేము కొంత సహాయం కోరవచ్చునా?" అన్నాడు.

హరిశిఖుడు నవ్వి, "సహాయమా? అది ఎలాంటిదైనా చేయగలను. మకరదేవతగా పిలవబడే, ఈ మకర పిశాచికి నా ప్రజల మూఢ విశ్వాసంవల్ల నే నెంతో ధనం ఖర్చు పెట్టి మనుష్యులను దానికి ఆహారంగా సమర్పించేందుకు కొంటున్నాను" అన్నాడు.

అప్పుడు శివదత్తుడు, హరిశిఖుడికి, కుండలినీ, మరాళ ద్వీపాల వృత్తాంతమంతా చెప్పి, "మీకు గొప్ప నావికాదళం, పెద్ద సేన ఉన్నవని విన్నాను. మా దేశాలను క్రూరుల పరిపాలననుంచి విముక్తి చేసేందుకు మీరు సహాయపడాలి!" అని అడిగాడు. హరిశిఖుడు అంగీకరించాడు.

ఆ రాత్రి శివదత్తుడికీ, అతడి అనుచరులకూ, హరిశిఖుడు గొప్ప విందు చేశాడు. మకరమండలంలోని అన్ని ప్రాంతాలకూ వార్తాహరులు పంపబడ్డారు. ఎంతో కాలం నుంచి ఎదురుచూస్తున్న మరుగుజ్జు వచ్చాడనీ అతడు మూఢులచే మకరదేవతగా పిలవబడే పిశాచిని, చంపగలడనీ వాళ్ళు చాటింపు వేశారు.



మరునాడు మిట్టమధ్యాహ్నం వేళ మకర మండల వాసులందరూ, మొసలి నివసించే ప్రాంతానికి వచ్చారు. అక్కడ ఉన్న ఒక కొండ శిఖరంనుంచి చూస్తే, కింద పారుతున్న ఒక నది కనబడుతుంది. ఆ నది అంచున ఒకగుహ ఆమొసలికి నివాసస్థానం.

వజ్రముష్టి అడుగు పొడవు గల రెండు కత్తులను, పిడులదగ్గిర బలమైన తాడుతో బిగించి, దానిని గుప్పెటతో పట్టుకుని అందరూ చూస్తూండగా శిఖరంమీది నుంచి నదిలోకి దూకాడు. తరవాత నది అవతలి ఒడ్డు చేరి, మొసలి నివసించే గుహ దగ్గిరకు వెళ్ళాడు.



వజ్రముష్టి గుహను సమీపించేంతలో, లోపలినుంచి నిప్పులు చెరిగే కళ్లతో పర్వతంలా ఉన్న మొసలి బయటికి వచ్చి నోరు తెరుచుకుని అతడిమీదికి దూకింది. వజ్రముష్టి ఉన్న చోటునుంచి వెనుకడుగు వేయకుండా తన చేతగల కత్తులను దాని నోటిలోకి పోనిచ్చాడు. రెండు వైపులా గల వాడి కత్తులు మొసలి రెండు దవడలలో బలంగా గుచ్చుకుపోయినై. అది బాధతో అటూ ఇటూ కొట్టుకుని నదిలోకి దూకింది

వజ్రముష్టి అదే అదనుగా భావించి తనదగ్గిర ఉన్న పెద్ద కత్తిని ఒరలోనుంచి దూసి, మొసలితోపాటు నదిలో దూకాడు. ఒకటి రెండు గంటలసేపు నీటిలో వజ్రముష్టికీ, మొసలికీ ఘోరమైన పోరు జరిగింది. వజ్రముష్టి దాని తోక దెబ్బలనుంచి తప్పుకుంటూ, క్రమంగా దాని శరీరాన్ని తన కత్తితో బాగా గాయపరిచి. చివరకు కొన ఊపిరితో ఉన్న మొసలిని ఒడ్డుకు లాగాడు.

కొండ శిఖరంనుంచి ఈ భయంకర పోరాటాన్ని తిలకిస్తున్న ప్రజలూ, హరిశిఖుడూ మొసలి మరణం చూచి జయజయధ్వానాలు చేశారు. ఆ తరవాత వారం రోజులపాటు మకరమండలంలో ఆనందోత్సవాలు జరిగినై.




హరిశిఖుడు తను చేసిన వాగ్దానం ప్రకారం, శివదత్తుడికి గొప్ప నావికా బలాన్నీ, ఇరవైవేలమంది సైనికులనూ ఒప్పచెప్పాడు. ఒక శుభముహూర్తాన శివదత్తుడూ, మందరదేవుడూ తిరిగి మరాళ, కుండలినీ ద్వీపాలను నరవాహనుడినుంచి జయించేందుకు బయలుదేరారు. వారి వెంట దేవమాయి, స్వయంప్రభకూడా ఉన్నారు. స్వయంప్రభ శమనద్వీప రాజకుమార్తె అన్న సంగతి అప్పుడు దేవమాయి శివదత్తుడికి తెలియబరిచింది.

శివదత్తుడు వెంటనే శమనద్వీపానికి రాయబారులను పంపాడు. స్వయంప్రభా,







మందరదేవుల వివాహం ఆ మూడు రాజ్యాలకూ మేలుచేయగలదని అతడి నమ్మకం.

తన కుమార్తె క్షేమంగా వున్నదనీ, ఆమెను మరాళద్వీపరాజైన మందరదేవుడు వివాహమాడ గోరుతున్నాడనీ తెలిసినప్పుడు శమనద్వీపరాజైన శమనుడు ఎంతగానో సంతోషించాడు. అతడుకూడా కొంత నావికా బలంతో, సైనికబలంతో కాబోయే అల్లుడికి సహాయపడేందుకు బయలుదేరాడు.

వేగులవల్ల తనమీదకు రానున్న యీ దాడిని గురించి విన్న నరవాహనుడు, భయంతో వణికిపోయాడు. మరాళ, కుండలినీ ద్వీపాలు రెంటినీ రక్షించుకోవటం తలకు మించిన కార్యమని అతడికి తోచింది. అతడు గుట్టుచప్పుడు కాకుండా, మరాళద్వీపాన్ని వదిలి, వున్న బలాన్నంతా కుండలినీ ద్వీపంలో కేంద్రీకరించాడు.

ఏ ప్రతిఘటనా లేకుండా శివదత్తుడూ, మందరదేవుడూ, ముందుగా మరాళ ద్వీపాన్ని ఆక్రమించుకున్నారు. మరునాడు కుండలినీ ద్వీపంలో దిగారు. తీరంలో ఎక్కడా నరవాహనుడి సైనికుడే లేడు.

శివదత్తుడికి యిది చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు లోపలి ప్రాంతాలకు వేగులను పంపాడు. వారు వెళ్లిన కొద్ది సేపటికే తిరిగి వచ్చి, "అయ్యా, మనం దాడి వస్తున్నామని తెలిసి లోగడ నరవాహనుడిచేత చిత్రహింసలకు గురి అయిన కోయలు, ఒక్కుమ్మడిగా తిరుగుబాటు చేశారు. వాళ్ల మూకలు, యిప్పుడు కుండలినీ నగరాన్ని ముట్టడిస్తున్నట్టు తెలిసింది!" అని చెప్పారు.

ఈ వార్త మందరదేవుణ్ణి చాలా నిరుత్సాహపరిచింది. "ఏ నాటికైనా, నా స్వహస్తాలతో ఆ క్రూర నరవాహనుణ్ణి చంపి తీరుతానని ప్రతిజ్ఞ చేశాను. ఇప్పుడు ఆ ప్రతిజ్ఞ వమ్మయేలా వుంది!" అన్నాడు మందరదేవుడు.



తరవాత శివదత్తుడు, ఓ యాభై మంది అశ్వ సైనికులను యిచ్చి, వజ్రముష్టిని ముందు పంపాడు. ఒకవేళ నరవాహనుడు యింకా బ్రతికి వుంటే, అతణ్ణి చంపవద్దని కోయలకు ఆజ్ఞాపించ వలసిందిగా, అతడు హెచ్చరించ బడ్డాడు.

వజ్రముష్టి అశ్వికులతో కుండలినీనగరం చేరేసరికే, మిడతల దండులా కోయలు నగరంమీద పడ్డారు. వాళ్ల కత్తులకూ, బాణాలకూ నరవాహన సైనికులు వందల వేల సంఖ్యలో దుర్మరణం పాలయారు. వజ్రముష్టి, శివదత్తుడినుంచి తను తెచ్చిన వర్తమానం కోయ నాయకులకు తెలియ బరుస్తూ, కోటను సమీపించేంతలో, ఒక బురుజు మీద కాళ్ళూ చేతులూ బంధింప బడిన నరవాహనుడు కోయభటుల మధ్య కనిపించాడు.

వజ్రముష్టి, "అతణ్ణి చంపకండి, చంప కండి!" అని అరుస్తూ, గుర్రాన్ని బురుజు కేసి పరిగెత్తించేంతలో, క్రూర నరవాహనుడు బురుజుమీది నుంచి కిందవున్న అగడ్తలోకి తోయబడ్డాడు. అదే సమయంలో ఆ ప్రాంతాల గుమిగూడిన కోయలు హర్ష ధ్వానాలు చేశారు. వజ్రముష్టి అగడ్తను సమీపించేసరికే నరవాహనుడు మరణించాడు.



రెండు మూడు గంటల తరవాత శివ దత్తుడూ, మందరదేవుడూ, శమనుడూ అక్కడికి వచ్చారు. వారికి కోయ నాయకులు ఘనమైన స్వాగతం యిచ్చారు. అప్పటికప్పుడే మందరదేవుడు మరాళ ద్వీపంతోపాటు కుండలినీ ద్వీపానిక్కూడా రాజుగా ప్రకటింపబడ్డాడు. కోయలందరికీ లోగడ నరవాహనుడు ఆక్రమించుకున్న భూములు తిరిగి ఇచ్చివేయబడినై.

వారం రోజుల తరవాత అతి వైభవంగా మందరదేవుడికీ, స్వయంప్రభకూ వివాహం జరిగింది. శివదత్తుడు, హరిశిఖుడు పంపిన సైనికులందరికీ గొప్ప గొప్ప బహుమానా



లిచ్చి, తిరిగి వారిని, వారి మకరమండలానికి పంపివేశాడు.

తరవాత ఒకరోజున శివదత్తుడి కోరికపై మందరదేవుడు నిండు దర్బారు ఏర్పాటు చేశాడు. దానికి మరాళ, కుంతలినీ ద్వీపాల్లోని పెద్దలంతా విచ్చేశారు. శివదత్తుడు తను సన్యసించి, అడవులకు వెళ్ళుతున్నట్టూ, శేషజీవితాన్ని దైవధ్యానంలో గడపదలిచినట్టూ ప్రకటించాడు.

ఇది మందరదేవుడితోపాటు, సభికులందర్నీ చాలా కలవరపరిచింది. వాళ్లందరూ శివదత్తుణ్ణి మంత్రిగాగాని లేక రాజగురువుగాగాని ఉండి, రాజ్యపాలన సక్రమంగా నడిచేట్టు చూడవలిసిందిగా కోరారు. శివదత్తుడు అంగీకరించలేదు. అతడు సభికులనూ, మందరదేవుణ్ణీ ఉద్దేశించి ఇలా చెప్పాడు:

"పాలకులూ, పాలితులూ ఎలాంటి ధర్మాలను పాటించితే, దేశానికి క్షేమమో యీ సరికి కుంతలినీ మరాళద్వీప వాసులందరికీ తెలుసునని నేను భావిస్తున్నాను. చిత్రసేన, సమరసేనుల పరిపాలనలతోబాటు, క్రూర నరవాహనుడి పరిపాలనను కూడా అందరూ చవిచూచారు. కనుక ఎలాంటిది ధర్మపాలనో, ఎలాంటిది కాదో ప్రజలందరికీ తెలిసి వుంటుంది. దానికి అనుగుణంగా వారు ప్రవర్తించ గలరని నేను నమ్ముతున్నాను!"

శివదత్తుడి మాటలకు సభికులంతా హర్షధ్వానాలు చేశారు. హర్షధ్వానాల మధ్య శివదత్తుడు అందరికీ నమస్కరించి, దర్బారు నుంచి బయలుదేరాడు. రాజూ, ప్రజలూ అతణ్ణి అనుసరించి పట్టణానికి నాలుగైదు క్రోసుల దూరంలో వున్న అరణ్యంవరకూ సాగనంపారు. శివదత్తుడు, అక్కడ అందరికీ మరోమారు నమస్కరించి, అరణ్యంలోకి వెళ్లిపోయాడు.

(అయి పోయింది)





# దురాశ దుఃఖంచేటు

విప్రకూటమనే అగ్రహారంలో ఒక పండితుడుండేవాడు. ఆయనకు సావిత్రి అని ఒక కుమార్తె ఉండేది. ఆ పండితుడివద్ద శరభుడు, కరభుడు అని ఇద్దరు శిష్యులుండేవారు. వారు చదువులో అంత చురుకైనవాళ్లు కారు. అయినా వారి ఆలోచనలు చాలా పెద్దవిగా ఉంటూండేవి.

ఇలా ఉండగా ఒకనాడు ఆ గ్రామానికి కామగ్రీవుడనే ఒక బ్రాహ్మడు వచ్చాడు. ఆయన వయస్సు అరవై ఏళ్ళు. ఆయన పండితుడి ఇంటిముందుగా వెళుతూ, వాకిట పండితుడి కుమార్తెను చూసి ఆగాడు. ఆ పిల్ల వెంటనే లోపలికి వెళ్లి తన తండ్రితో, "నాన్నా, ఎవరో వచ్చారు," అని చెప్పింది.

పండితుడు బయటికి వచ్చి ముసలివాణ్ణి చూశాడు. ఆయన పొరుగూరివాడని తెలుసుకుని, "అయ్యా, ఈ పూటకు మా ఇంట్లో ఉండండి," అని ఆహ్వానించాడు. కామగ్రీవుడు కోరినదికూడా అదే. భోజనాలయినాక ఆయన పండితుడితో, "అయ్యా, మీతో ఒక విషయం రహస్యంగా మాట్లాడాలి," అన్నాడు.

వెంటనే పండితుడు తన శిష్యులనిద్దరినీ బయటికి పంపేశాడు. తరవాత కామగ్రీవుడు పండితుడితో, "నేను వృద్ధుడినని సందేహించ వద్దు. నాకు మీ కుమార్తెనిచ్చి పెళ్లి చేయండి. నేను ఒక యోగివద్ద పరకాయప్రవేశమూ, ఇంద్రజాలమూ సాధించాను. కాని వాటి మహిమను చూసే లోపునే, నేను కాశీలో గంగాతీరాన కాలు జారి పడి ఒక పన్ను విరగగొట్టుకున్నాను. ఇక నాకా విద్యలు పారవు. అందుచేత పెళ్ళాడి, చచ్చిపోయే లోపుగా ఒక కుమారుణ్ణి కని వాడికి ఆ రెండు విద్యలూ ఇచ్చి పోదామను కుంటున్నాను," అన్నాడు.

ఎం. రమాకాంతశర్మ



కామగ్రీవుడి మాటలలో పండితుడికి గురి కుదరలేదు. పదేళ్లుకూడా నిండని తన కుమార్తెను అంత ముసలివాడికివ్వటం ఆయనకు ఇష్టంలేక పోయింది. అందుచేత ఆయన కామగ్రీవుడితో, "క్షమించండి! నాకు ఉన్నదే ఒక్క కూతురు. అప్పుడే దానికి పెళ్లిచేసే ఉద్దేశం లేదు!" అన్నాడు.

కామగ్రీవుడు నిస్పృహచెంది పండితుడి దగ్గిర సెలవు పుచ్చుకుని తన దారిన తాను వెళ్లాడు.

అయితే శరభుడూ, కరభుడూకూడా చాటున ఉండి, ముసలివాడికీ తమ గురువు గారికీ జరిగిన సంభాషణ అంతా విన్నారు. తరవాత వాళ్ళిద్దరూ కూడబలుక్కుని, "మనకు చదువు ఎలాగూ అంటటంలేదు. ఆ ముసలివాణ్ణి అంటిపెట్టుకుని శుశ్రూష చేశామంటే, చచ్చిపోయేటప్పుడు తన విద్యలు మన చేతిలో పెట్టిపోతాడు!" అని నిశ్చయించుకున్నారు.

అందుచేత వాళ్ళిద్దరూ గురువుతో చెప్ప కుండా బయలుదేరి, దారివెంట కనిపించిన వారిని అడుగుతూ, కామగ్రీవుడు ఎటుగా వెళ్లినదీ తెలుసుకుని, ఆ సాయంకాలమే ఆయన్ని పట్టుకున్నారు. ఆయన వారిని గుర్తించి, "మీరెందుకు ఇలా వచ్చారు?" అని అడిగాడు.

"స్వామీ, మీరు మా గురువుగారి కుమార్తెను చేసుకుంటామంటే మా గురువు గారు వల్లకాదన్నారట. మీరు వెళ్ళాక గురువుగారికీ భార్యకూ పెద్ద దెబ్బలాట అయింది. ఆవిడ పెళ్లిచేస్తే బాగుండేదన్నది. మేముకూడా ఆవిణ్ణి బలపరిచాం. గురువు గారు మామీద మండిపడి మమ్మల్ని వెళ్ళ గొట్టారు. మీ కెలాగయినా పెళ్లి చేయించి తీరుతామని శపథంపట్టి బయలుదేరి వచ్చాం. మా శపథం పూర్తికావటానికి అవకాశం ఇవ్వండి!" అన్నారు శరభ కరభులు వినయంగా.



ఈ మాట విని ఆశపడినవాడై కామ గ్రీవుడు వాళ్ళిద్దర్నీ తనవెంట రానిచ్చాడు. ఆయన ఊళ్లూళ్లు తిరిగి చాలాచోట్ల తనకు పిల్లనివ్వమని అడిగాడు. ఆయన వింటూండగా శరభ కరభులు ఆయనను బలపరిచేవాళ్లు; ఆతరవాత పిల్లనిచ్చే వాళ్ళదగ్గిరికి వెళ్లి, "ఆ ముసలాడు ఇవాళో రేపో గుటుక్కు మంటాడు. మీ పిల్లనుమాత్రం ఇవ్వకండి!" అంటూ చెప్పేవాళ్లు.

ఏమైనా, కామగ్రీవుడికి మాత్రం పెళ్ళి కానేలేదు. కొంతకాలాని కాయన మంచాన పడ్డాడు. ఇక తనకు ఆయుర్దాయం తీరిపోయిందని తోచగానే, శరభుడిచేతిలో పరకాయ ప్రవేశ విద్యా, కరభుడి చేతిలో ఇంద్రజాల విద్యా పెట్టేసి కళ్లుమూశాడు.

ఈ విధంగా తమ కోరికలు ఫలించినవారై శరభ కరభు లిద్దరూ తమ విద్యలతో వినోదించటంకోసం దేశాటన బయలుదేరారు. కొన్నాళ్లు ప్రయాణంచేసి ఒక నగరం చేరారు. అక్కడ కరభుడు తన ఇంద్రజాలం చూపి, రాజుగారిని మెప్పించి, డబ్బు సంపాదింతా మనుకున్నాడు. ఇది చూసి శరభుడు చాలా అసూయపడ్డాడు. కాని వాళ్లు నగరంలోకి వెళ్లి విచారిస్తే రాజుగారు చాలా జబ్బుగా ఉన్నాడనీ, ఏ విధమైన వినోదాలకూ ఉత్తరువు లేదనీ తెలిసింది. ఒకవేళ రాజు చచ్చిపోతాడేమో, అప్పుడు శరభుడు పరకాయ ప్రవేశ విద్యద్వారా తానే రాజై లాభం పొందుతాడేమోనని కరభుడు అసూయ పడ్డాడు.

ఇంతకూ కొద్దికాలంలోనే రాజుగారి వ్యాధి కుదిరింది. తరవాత కరభుడు తన ఇంద్రజాలవిద్య చూపించి రాజువద్ద అంతులేని బహుమానాలు పుచ్చుకున్నాడు. ఇది చూసి సహించలేక శరభుడు కరభుడితో పోట్లాడి ముందుకు సాగివెళ్లాడు.

అతను అలా కొద్దిరోజులు ప్రయాణించి మరొక నగరం చేరాడు. సరిగా ఆ సమ

యానికే ఆ ఊరి రాజు రత్నాకరుడు మరణించాడు. ఈ వార్త శరభుడి చెవిన పడగానే అతను ఒకచోట చితిపేర్చి అందులో తన శరీరాన్ని పడేసి తాను వెళ్లి రత్నాకరుడి శరీరంలో ప్రవేశించాడు. చచ్చిన రాజు బతికాడని అందరూ సంతోషించారు.

అయితే తిరిగి బతికినప్పటినుంచీ రాజులో చాలా మార్పు కనిపించింది. వెనకటి రాజఠీవి ఏమాత్రమూ లేదు. వెకిలిగా మాట్లాడ సాగాడు. తనకు సంబంధించిన విషయాలే తెలియనివాడల్లే కనిపించాడు. ఈ మార్పు చూసి మంత్రులకే ఆశ్చర్యమయింది. రాణీ, ఆమె కుమార్తె కీర్తిసేనా రాజువద్దకు వెళ్ల నిరాకరించారు. మంత్రులు వచ్చి, "మహారాజుగారు తమకోసం అడుగుతున్నారు," అని చెబితే, రాణి, "మహారాజుగారు ఆనాడే పోయారు. నేను విధవరాలిని. నన్ను ఎవరుగాని పిలిపించవలసిన అవసరం లేదు," అని ఖండితంగా చెప్పేసింది.

శరభుడు రత్నాకర మహారాజు శరీరంలో ప్రవేశించిన కొద్దికాలానికి కరభుడు కూడా ఆ నగరమే చేరాడు. ఆతిథ్యానికి ఒకరి ఇంటికి వెళ్లాడు. ఆ ఇంటి యజమాని శంతనుడనే బ్రాహ్మణ యువకుడు. అతను రాజుదగ్గిర పౌరోహిత్యం



చేస్తున్నాడు. మాటల సందర్భంలో శంత నుడు కరభుడితో తన రాజు చర్యలన్నీ చెప్పి, "ఇప్పుడా ముసలాడికి మళ్లీ పెళ్లి కావాలిట. చక్కని పిల్ల ఎక్కడన్నా ఉంటే పెళ్లిచెయ్యమని నన్ను చంపుకు తింటున్నాడు," అన్నాడు.

సంగతి సందర్భాలన్నీ విన్నమీదట, శరభుడు రాజుశరీరంలో ప్రవేశించాడా అని కరభుడికి అనుమానం కలిగింది. "అన్నా, నేను చెప్పినట్టు చేస్తే మీ రాజుకు పట్టిన గ్రహాన్ని నేను వదలగొడతాను. నేను కొద్ది రోజులు రహస్యంగా మీ ఇంటనే ఉండి ఇంద్రజాలం చేస్తాను. నువు ఈ సాయం కాలమే మీ రాజును ఉద్యానవనానికి బయలుదేరతియ్యి. అక్కడ ఒక అప్సరస లాటి స్త్రీ ఉన్నదని చెప్పు. ఆయనను ఊరికి ఉత్తరంగా ఉన్న శ్మశానానికి తీసుకుపో. మిగిలినదంతా నేను చూస్తాను," అని కరభుడు శంతనుడితో అన్నాడు.

శంతనుడు రాజువద్దకు వెళ్లి, "మహా రాజా, ఊరికి ఉత్తరాన ఉన్న మన ఉద్యానవనంలో రంభలాటి కన్య ఎవరో వచ్చి ఉంటున్నది. ఆమెను తమరొక్క సారి చూడాలని నా మనవి," అన్నాడు.

రాజు సరేనని ఆత్రంగా బయలుదేరాడు. ఇద్దరూ కలిసి శ్మశానానికి వెళ్లారు. అక్కడ





కరభుడు తన ఇంద్రజాల విద్యచేత సృష్టించిన అద్భుతమైన ఉద్యానవనం వారికి కనిపించింది. అందులో కొంతదూరం పోయేసరికి ఒక పొదరింటిలో ఒక అపూర్వ సౌందర్యవతి వీణ వాయిస్తూ రాజుకంట పడింది. వెంటనే రాజు ఆమెవేపు పరిగెత్తబోయి పడ్డాడు. ఆయన లేచి చూసేసరికి ఉద్యానవనంగాని, స్త్రీగాని అక్కడ లేదు.

"ఇదేమిటి? మాయలాగుంది!" అన్నాడు రాజు ఆశ్చర్యపోయి.

"మహారాజా, మీరా స్త్రీ చక్కదనం చూసి మూర్ఛపోయారు. నేను మిమ్మల్ని ఇంటికి చేర్చుతూండగా దారిలో తమకు స్పృహవచ్చింది. ఇవాళ పొద్దుపోయింది. రేపు మళ్లీ వచ్చి సావకాశంగా ఆ స్త్రీతో మాట్లాడుదురుగాని!" అంటూ శంతనుడు రాజును ఇల్లుచేర్చాడు.

రాజు మంత్రులతో, "ఊరికి ఉత్తరంగా ఉన్న మన ఉద్యానవనంలోని వనపాలకులను పిలిపించండి. అక్కడ ఉంటున్న దేవతాస్త్రీకి ఏలోటూ రాకుండా చూడమని స్వయంగా హెచ్చరించాలి!" అన్నాడు.

మంత్రులు నిర్ఘాంతపోయి, "మహాప్రభూ, మన ఊరికి ఉత్తరంగా ఉద్యానవనం లేదే, వనపాలకులను ఎలా రప్పించమన్నారు?" అని అడిగారు.

రాజు వారిని తిట్టి, "నేను స్వయంగా చూస్తే లేదంటారేమిటి? మీవల్ల ఏ పనీ కాదు. నాకు శంతనుడు తప్ప స్నేహితుడే లేడు," అన్నాడు.

ఈలోపుగా శంతనుడు ఇంటికి పోయి కరభుడితో జరిగినదంతా చెప్పాడు. రాజు శరీరంలో ఉన్నది శరభుడేనని కరభుడు రూఢిచేసుకున్నాడు. అతను ఆ రాత్రే శంతనుడి సహాయంతో రాణిని చూడబోయాడు. అక్కడే రాజకుమార్తె కీర్తిసేన కూడా ఉన్నది. కరభుడు రాణీతో, "అమ్మా, మహారాజు కళేబరంలో ప్రవేశించినవాడు

శరభుడనేవాడు. నా యుక్తిచేత వాణ్ణి వదలగొడతాను," అని చెప్పాడు. ఆవిడ దానికి సమ్మతించింది.

కరభుడు రాణివాసానికి వస్తూ పోతూ ఉండటానికి అనుమతి దొరికింది. అతనికి కీర్తిసేనను చూస్తున్నకొద్దీ ఆమెను పెళ్లాడా లనే కోరిక జాస్తి కాసాగింది. ఒకరోజు అతను శంతనుడితో, "అన్నా, నాకు ఎలా గైనా రాజకుమార్తె నిచ్చి పెళ్లిచేస్తివా, నా దగ్గిర ఉన్న ఇంద్రజాల విద్యను నీకు ఇచ్చేస్తాను!" అన్నాడు.

ఇంద్రజాలం కళ్ళారా చూసి ఉన్న కారణంచేత శంతనుడికి ఆ విద్య సంపా దించాలని ఆశ పుట్టింది. శంతనుడు వెంటనే రాజువద్దకు వెళ్ళి, "మహారాజా, మనం చూసిన అప్సరస మీకు స్వాధీనం కావాలంటే మనకు ఒక బ్రాహ్మణయువకుడి సహాయం కావాలి. తమ కుమార్తె నిచ్చి వివాహంచేస్తేనేగాని అతను సహాయం చెయ్యడట. ఏం సెలవు?" అని అడిగాడు.

"దీనికింత ఆలోచన ఎందుకు? వివాహప్రయత్నాలు వెంటనే ఆరంభించ మని మంత్రులతో చెప్పు!" అన్నాడు రాజు.

తన కుమార్తెకు పెళ్ళిప్రయత్నాలు చేస్తున్నారనీ, ముహూర్తంకూడా సమీపం



లోనే ఉన్నదనీ రాణీకి తెలిసింది. ఈ ప్రయత్నాలకు కారకుడు శంతనుడని తెలి సింది. కాని పెళ్ళికొడు కెవరో తెలియ లేదు. ఆ రహస్యం తెలుసుకోవటానికని రాణి శంతనుణ్ణి పిలిపించి, "శంతనా, అమ్మాయిని ఎవరికో ఇచ్చి పెళ్ళి చేయి స్తున్నావుట; నాతో మాటమాత్రం చెప్పలేక పోయావా? అమ్మాయిని నీకే యిచ్చి పెళ్ళి చేయాలని అనుకుంటున్నానుగదా! ఎందు కిలా చేశావు?" అన్నది.

శంతనుడు తనవల్ల పొరపాటు జరిగిం దని తెలుసుకుని, పశ్చాత్తాపంతో, "అమ్మా, నేనేం చెసేది? కరభుడనేవాడు మన రాజు

గారిని పట్టిన నీచుణ్ణి తన ఇంద్రజాల విద్యతో వదలగొడతానన్నాడు. కాని అతనికి కీర్తిసేనను పెళ్ళాడాలన్న దుర్బుద్ధి పుట్టింది. అతను తన ఇంద్రజాల విద్యను నాకిచ్చే షరతుపైన పెళ్ళి జరిపించటానికి ఒప్పుకున్నాను. ఆ విద్య నా చేతికి వస్తే నేనైనా రాజుగారిని పట్టినవాణ్ణి వదలగొట్ట వచ్చునుగదా అనుకున్నాను!" అన్నాడు.

"పిచ్చివాడా, రాజుగారి సంగతి చూసి నాకసే ముహూర్తం పెడతావనలేక పోయావా?" అన్నది రాణి.

కీర్తిసేన జరిగినదంతా తల్లివల్ల విన్నది. ఆమె తన చెలికత్తెకు చెప్పవలిసిన మాటలన్నీ చెప్పి కరభుడి దగ్గిరికి పంపింది. అతి నెరజాణ అయిన ఆ చెలికత్తె కరభుడి దగ్గిరికి వెళ్ళి, "నువు పెళ్ళాడబోతున్నావని విని మా రాజకుమార్తె ఎంతో సంతోషించింది. ఆమె ఒప్పుకోదని నువు దాచిపెట్టావులాగుంది, కాని ఆమె నిన్ను చూసినది మొదలు ఎప్పుడు పెళ్ళాడదామా అని ఉంది. కాని ఒక్క పొరపాటు చేశావు! నీ ఇంద్రజాల విద్య ఆ శంతనుడికి ఎందుకిస్తానన్నావు? అతను చెయ్యకపోతే నీ పెళ్ళి ఆగుతుందా?" అన్నది.

కరభుడు పశ్చాత్తాపపడి, "అయ్యో, మాట ఇస్తినే!" అన్నాడు.



"ఇప్పుడేమీ మిగిలిపోయిందిలేదు. ఇవాళో రేపో రాజుగారిని పట్టినవాణ్ణి వదల గొట్టి వెంటనే ఆ ఇంద్రజాల విద్యను నీ కాబోయే భార్యదగ్గిరే దాచిపెట్టు. శంత నుడు నిన్నేమీ చెయ్యలేడు," అన్నది.

మరి కాస్సేపటికి శంతనుడు వచ్చి కరభుడితో, "ఇంక జాగుచేస్తే మన ఇద్దరి మర్యాద దక్కదు. నువు వెంటనే రాజును పట్టిన శరభుణ్ణి వదలగొట్టు. నీకు పెళ్ళి అయేటట్టు నేను చూస్తాను," అన్నాడు.

కరభుడు ఆ రోజు మళ్ళీ ఇంద్రజాలం పన్నాడు. ఆ రోజే ఒక గొల్ల కుర్రవాడు పాము కరిచి చావగా, మాయచేసి కర భుడు ఆ శవాన్ని ఒకచోట దాచిఉంచాడు. ఆ సాయంకాలం మళ్ళీ అతను ఉద్యాన వనం కల్పించి అందులో మాయస్త్రీని ఉంచి ఆమె పక్కనే గొల్లయువకుడి శరీ రాన్ని ఉంచాడు. ఆ సాయంకాలం శంత నుడు రాజును మాయోద్యానానికి తీసుకు వెళ్ళాడు. వారు వెళ్ళేసరికి ఆ స్త్రీ గొల్లవాడి శవం పక్కన కూచుని ఏడుస్తున్నది.

"ఏమిటిది? వీడెవడు? ఎందుకేడు స్తున్నావు?" అని రాజు ఆమె నడిగాడు.

"ఏం చెప్పేది? వీడు నా నౌకరు. నాకు మా తండ్రి ఇచ్చిన నిధిని వీడెక్కడో దాచి కాపాడుతున్నాడు. అటువంటివాడు అక



స్మాత్తుగా పాము కరిచి చచ్చాడు. ఆ రహస్యం తెలుసుకోవాలి. వాడెలాగైనా రెండు నిమిషాలు బతికితే చాలు!" అన్నది.

"దీనికి నువ్వింత విచారించ నవసరం లేదు. వీణ్ణి నేను ఇప్పుడే బతికిస్తాను!" అంటూ రాజు శరీరంలో ఉన్న శరభుడు ఆ శరీరాన్ని వదిలేసి గొల్లవాడి శరీరంలో ప్రవేశించాడు. ఆ సమయంలో అక్కడే అదృశ్యంగా ఉన్న కరభుడు రాజు శరీరాన్ని కత్తితో రెండు తుండాలుగా నరికేశాడు. మరుక్షణం ఉద్యానవనమూ, ఏడిచే స్త్రీ మాయమై శంతనుడూ, కరభుడూ, గొల్లవాడి రూపంలో శరభుడూ మిగిలారు.

శంతనుడూ, కరభుడూ చేరి గొల్లవాణ్ణి పెడరెక్కలు విరిచికట్టేశారు. "ఇక జాగు చేయక నీ ఇంద్రజాల విద్య నాపరం చెయ్యి," అన్నాడు శంతనుడు.

"రాజు కూతురి మెడలో తాళికట్టిన మరుక్షణం అలాగే ఇస్తాను," అన్నాడు కరభుడు.

ఇద్దరూ గొల్లవాణ్ణి తీసుకుపోయి రాణికి చూపించి, "రాజు శరీరంలో ప్రవేశించిన దుర్మార్గుడు ఇప్పు డీ గొల్లవాడి శరీరంలో ప్రవేశించాడు. వీడికి ఏ శిక్ష విధిస్తారో విధించండి!" అన్నారు. మంత్రులు గొల్లవాణ్ణి ఖైదు చేయించారు.

తరవాత కరభుడు కీర్తిసేనవద్దకు వెళ్ళి, "ఇదుగో నా ఇంద్రజాల విద్య. ఇక మనకు పెళ్ళికావటమే తరవాయి!" అన్నాడు. ఆమె వానివద్దనుంచి ఇంద్రజాల విద్య తీసుకుని, నౌకర్లతో "ఈ అశాపాతకుణ్ణి ఖైదులో వేసి రండి!" అన్నది.

కరభుణ్ణి ఖైదుచేశారనగానే శంతనుడు, ఇక తనకూ రాజకుమార్తెకూ పెళ్ళి తప్పదని భావించి రాజసౌధానికి వచ్చాడు. అతన్ని రాజభటులు పట్టుకుని ఖైదులో వేశారు. ఈ విధంగా దురాశకు పోయిన శరభుడూ, కరభుడూ, శంతనుడూ కారాగృహ వాసం అనుభవించారు.



# నావికుడు సింద్‌బాద్

రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ మేం గాలివాలున కొట్టుకుపోయి మరొక దీవిలో వెళ్ళి పడ్డాం. అప్పటికి మేం కడప్రాణాలతో ఉన్నాం. మేం కాసిని పళ్ళు తిని, నీరుతాగి, ఒక ఎత్తయిన చెట్టు ఎక్కేసరికల్లా చీకటిపడి పోయింది. మేమూ రాత్రి చెట్టుమీదనే నిద్ర పోయాం.

తెల్లారి మేం కళ్ళు తెరిచేసరికి మా కంగారు ఏమని చెప్పను! ఒక భయంకరమైన సర్పం, మే మెక్కి ఉన్న చెట్టుబోదె అంత లావుది, గుహలాగా నోరు తెరుచుకుని మా వైపే వస్తున్నది. అది మమ్మల్ని చూడగానే మా ఎత్తు లేచి, నావెంట ఉన్నవారిలో ఒకణ్ణి కబళించేసి వెళ్ళిపోయింది.

అది వెళ్ళిపోయాక నేనూ, రెండవవాడూ కలిసి చెట్టు దిగి, ఇన్ని పళ్ళు కోసుకు తిని, నీళ్ళు తాగి, ద్వీపమంతా ఘాలించి ఇంకా ఎత్తయిన చెట్టు చూసుకుని, దానిమీద ఎక్కి ఆ రాత్రికి నిద్రపోయాం. కాని తెల్లవారేసరికల్లా ఆ దుష్ట సర్పం మేమున్న చోటికి తయారయింది. అది అవలీలగా చెట్టుకు తన శరీరం పెనవేసి పైకి పాకి నా వెంట ఉన్న రెండో వాణ్ణికూడా మింగేసి వెళ్ళిపోయింది.

మూడవ సముద్రయానం

CHITRA

నాకు చెప్పరాని దడ పుట్టుకొచ్చింది. ఇక నేనుమాత్రమే మిగిలిఉన్నాను. మేమా రాక్షసుడి నోట పడకుండా తప్పించుకు వచ్చినది ఈ క్రూరసర్పం నోట పడటాని కేనా? "ఛీ, ఇంతకంటె ఆత్మహత్య చేసు కుంటే నయం!" అనిపించి నేను సముద్ర తీరానికి పరిగెత్తాను.

కాని జీవితేచ్ఛ అతి చిత్రమైనది. అది ప్రాణంపై ఆశను అంత సులువుగా వదులు కోదు. పామును తప్పుకునేటందుకు నాకు ఒక ఉపాయం తట్టింది. నేను సముద్రం ఒడ్డున గల కలప పోగుచేసి నాలుగు వెడల్పయిన చెక్కలు నాలుగు వైపులా అడ్డంపెట్టుకుని, వాటిమధ్య పడుకుని, పైన కొన్ని కర్రముక్కలు వేసుకున్నాను. పాము దాని వేళకు అది వచ్చింది. ఆ చెక్కల సందునుంచి నన్ను బయటికి తీయాలని విశ్వప్రయత్నాలు చేసి విఫలమయింది. చివరకు విసుగెత్తి అది నన్ను విడిచి తన దారిన వెళ్ళిపోయింది.

అది వెళ్లిపోయిందని రూఢిచేసుకున్నాక నేను చెక్కలు తోసివేసి బయటికి వచ్చి సముద్రతీరానికి వెళ్ళాను. సముద్రంమీద దూరాన ఒక ఓడ కనిపించింది. నేను వెర్రివాడిలాగా కేకలువేస్తూ చేతులూపాను. తరవాత ఒక చెట్టుకొమ్మకు తలపాగా విప్పి



కట్టి ఆడించాను. అదృష్టవశాత్తూ ఇది ఓడవాళ్ళ కళ్ళబడింది. ఓడ దారితప్పించి ద్వీపంవేపు వచ్చింది. త్వరలోనే అది తీరాన లంగరు వేసుకున్నది. ఓడకళాసులు నన్ను ఎక్కించుకున్నారు.

ఓడలోకి ఎక్కగానే నాకు మంచి దుస్తులిచ్చారు, సుష్టుగా భోజనం పెట్టారు. చాలా బడలిఉన్నానేమో, సుఖమైన నిద్ర పట్టింది. మృత్యుదేవత కళ్ళలోకి చూసి, చూసి హతాశుడినై ఉన్న నాలో మళ్ళీ జీవచైతన్యం కలిగింది. క్రమంగా నేను మామూలు మనిషినైపోయి గడిచిన కష్టాలను పీడకలలకింద పరిగణించసాగాను.

మా ప్రయాణం సుఖంగా సాగింది. చివరకు మేం సలాహితా అనే ద్వీపం చేరాం. రేవులో లంగరు దించగానే ఓడలోని వర్తకులంతా క్రయవిక్రయాలు చెయ్యటానికి కిందికి దిగివెళ్ళారు. అప్పుడు ఓడసరంగు నాదగ్గిరికి వచ్చి, "చూడు, బాబూ! నువు అతి పేదవాడివిగా, దిక్కులేనివాడివిగా కనబడుతున్నావు. చాలా కష్టాలు పడ్డానంటున్నావు. కనక నీకు ఒక సహాయం చేస్తాను. నిన్ను నీ గ్రామం చేరుస్తాను. ఇంతకాలంగా పడ్డబాధలన్నీ మరిచిపోయి నా పేరు చెప్పుకుని సుఖంగా బతుకుదువుగాని," అన్నాడు.





"అయ్యా, ఏం సహాయం చేసినాసరే మీ మేలు ఎన్నటికీ మరవను," అన్నాను.

"అయితే విను. కొన్ని ఏళ్లక్రితం మా వెంట ఒక వర్తకుడుండేవాడు. అతను ప్రయాణంలో ఒక దీవిలో దిగబడి పోయాడు. ఆతరవాత అతని జాడే తెలియ లేదు. అతను బతికే ఉన్నాడో, చచ్చి పోయాడో! అతని సరుకంతా కొట్టులో వేసి ఉంది. అదంతా నీపరం చేస్తాను. దాన్ని తీసుకుపోయి విక్రయించి, కొంత వట్టంకింద నువు ఉంచుకుని మిగిలినది నాకిచ్చెయ్యి. నేను దానిని తీసుకుపోయి అతని బంధువు లకు అందజేస్తాను," అన్నాడు సరంగు.

"ఆ పని చేసినట్టయితే నన్ను బతి కించిన వారవుతారు. ఈ పరిస్థితిలో అంత న్యాయంగా డబ్బు సంపాదించు కోవటం కంటె కావలిసిన దేమిటి?" అన్నాను.

అప్పుడు సరంగు గుమాస్తాను దగ్గరకు పిలిచి, "బేళ్ల నన్నిటినీ చిట్టాలో రాయ వయ్యా!" అన్నాడు.

"చిత్తం. వీటిని ఎవరిపేర రాయ మన్నారు!" అని గుమాస్తా అడిగాడు.

"ఈ సరుకంతా నావికుడు సింద్‌బాద్‌ది. కాని దానిని ఈ మనిషిపేర రాయి. పేరు అతన్నే అడిగి కనుక్కో," అన్నాడు సరంగు.

"నేనే నావికుడు సింద్‌బాద్‌ను!" అని కేకపెట్టాను, ఆశ్చర్యంతో. నేను సరంగును పరికించి చూతునుగదా, నా రెండవ సముద్రయానమప్పుడు నన్ను ఒక దీవిలో వదిలిపెట్టి నౌకను తరలించుకు పోయిన సరంగు ఇతనే!

నేను సంభ్రమంతో, "నన్ను గుర్తించ లేదా? నేను నిజంగా నావికుడు సింద్ బాద్‌నే! బాగ్దాద్ వర్తకుణ్ణి. నా కథ వినండి. నేనే చాలా ఏళ్లక్రితం ఆ ద్వీపం మీదికి వెళ్ళి తిరిగి పడవ అందుకోలేక పోయాను. మంచి సెలయేటిపక్క భోజనం చేసి పడుకుని నిద్రపోయాను. నేను నిద్ర

లేచేసరికి పడవ అప్పుడే కనుచూపుమేర దూరం వెళ్ళింది. ఆ తరవాత రత్నాల పర్వతం వెళ్ళిన వర్తకులు నన్ను చూశారు. వారిలో ఎవరైనా యిక్కడవుంటే నన్ను గుర్తించగలరు," అన్నాను.

నేనీ ధోరణిలో మాట్లాడుకుపోతున్న సమయంలో ఒక వర్తకుడు, వెంటబెట్టుకు పోయిన సరుకంతా అమ్మేశాడుకాబోలు, మరికొంత సరుకుకోసం నౌకకు తిరిగి వచ్చాడు. నా ముఖంకేసి పరకాయించి చూసి, ఆశ్చర్యంతో చేతులు రెండూ కలిపి పట్టుకుని, "అరే, అల్లా! నా మాట ఒక్కరు నమ్మలేదు. గండభేరుండపక్షి రత్నాల లోయలోనుంచి మనిషిని పైకి తీసుకురావటం కళ్లారా చూశానంటే అన్నీ పట్టిదే నన్నారు! ఇదిగో ఆ మనిషి! సింద్‌బాద్ నావికుడు—నాకు వెలలేని రత్నాలిచ్చిన ధర్మాత్ముడు," అంటూ నన్ను ఆలింగనం చేసుకున్నాడు.

అప్పుడుగాని సరంగు నన్ను పోల్చుకోలేదు. అతను నా చేతులు రెండూ పట్టుకుని ప్రాణాలతో బయటపడినందుకు నన్ను తెగ అభినందించాడు. తరవాత నా సరుకు లన్నీ రేవులో దింపించాడు. వాటిని విక్రయించగా నాకు అంతులేని లాభం వచ్చింది.

సలాహితానుంచి బయలుదేరి సింధు దేశం వెళ్ళాం. అక్కడి సముద్రాలలో నేను ఆవుముట్టె గల చేపలనూ, గాడిదముట్టె గల చేపలనూ, పక్షుల్లాగా ఎగిరే చేపలనూ చూశాను. ఈ విధంగా మేం బహుకాలం సముద్రాలపై తిరిగి ఎట్లాగైతేనేం బస్రా చేరుకున్నాం. అక్కడినుంచి నా స్వస్థలమైన బగ్దాద్‌నగరం వెళ్లి, బంధుమిత్రుల నందరినీ కలుసుకున్నాను.

కిందటిసారికన్న ఎక్కువ లాభంతో తిరిగివచ్చాను గనక నగరంలోని పేదసాదలందరికీ దానధర్మాలు చేశాను. మళ్ళీ నా జీవితం సుఖవంతంగా నడవసాగింది.



# వృథా శ్రద్ధ

ఒక గ్రామంలో ఒక చిన్న భూస్వామి ఉండేవాడు. ఆయన తండ్రి చాలా వృద్ధుడై కాలంతీరి చనిపోయాడు. కాని భూస్వామి తండ్రి చావుకు బెంగపడి పోయి, అస్తమానం ఏడుస్తూ, తండ్రి అస్తికలను ఒక కుండలో పెట్టి దొడ్లో పాతించి, సమాధి కట్టి, ఆ సమాధిని రోజూ పూలతో పూజించసాగాడు.

ఈ భూస్వామికి ఒక కొడుకున్నాడు. ఆ కుర్రవాడికి తండ్రి వైఖరి ఏమీ నచ్చలేదు. వీలుదొరికితే తండ్రికి మంచి గుణపాఠం నేర్పాలనుకున్నాడు.

ఒకనాడా కుర్రాడికి గ్రామం వెలపల ఒక చచ్చిన ఎద్దు కనిపించింది. వాడు కొంత గడ్డిపీకి, ఎద్దు నోటి దగ్గిరికి తీసుకు పోయి, "తిను, తిను!" అన్నాడు. చచ్చిన ఎద్దు గడ్డి తింటుందా అని వాడి స్నేహితులు అడిగారు గాని వాడు వినిపించుకో లేదు.

వాడి స్నేహితులు వెళ్ళి భూస్వామితో, "అయ్యా, మీ వాడికి పిచ్చి పట్టింది. వాడు చచ్చిన ఎద్దుకు గడ్డి పెడు తున్నాడు!" అని చెప్పారు.

భూస్వామి వచ్చి, "చచ్చిన ఎద్దు ఎక్కడైనా గడ్డి తింటుందిరా? ఇంటికి పద!" అని కొడుకును మందలించాడు.

"పిడికెడు బూడిద అయిన తాతయ్య పూలు వాసన చూడగాలేందీ, కాళ్లూ, తలా, నోరు గల ఎద్దు గడ్డి తినటానికేం, నాన్నా?" అని అడిగాడు కుర్రాడు. దానితో, భూస్వామి బుద్ధి తెచ్చుకుని, చచ్చిన తండ్రికోసం పూజ చెయ్యటం మానేశాడు.



# అపాత్రుడి దానం



పట్టు విడవని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, శవాన్ని దింపి భుజాన వేసుకుని, ఇంకొకసారి శ్మశానంకేసి మౌనంగా నడవ సాగాడు. అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, నీ దీక్ష చాలా గొప్పది. కాని ఎంతో మంచి పని చేసేటప్పుడుకూడా దీక్ష గలవాడికి ఎటువంటి సమస్యలు ఎదురవుతాయో నీవెరగవు. ఇందుకు తార్కాణంగా శీలయాజి కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం గౌతమీ నదీ తీరాన అభయగిరి అనే గ్రామంలో శీలయాజి అనే బ్రాహ్మణోత్తము డుండేవాడు. ఆయన ఎంతో దయాస్వభావం కలవాడు, భగవద్భక్తి కలవాడు. ఆయనకు పెళ్ళి, సంసారమూ లేదు, కాని కొంత ఆస్తి ఉన్నది. ఆ ఆస్తిని అనుభవించటానికి పిల్లలు లేరుగనక, ఆయన తన జీవితం వెళ్లే లోపుగా అనేక సత్క

## బేతాళ కథలు



ర్మలు చేయ నిశ్చయించాడు. తనకు గల దానిలోనుంచి ఆయన ఒక రామాలయమూ, దానికి దగ్గిరనే ఒక పెద్ద సత్రమూ కట్టించాడు.

ఆ రెంటితో ఆయనకు గల డబ్బంతా అయిపోయింది. కాని చేయదలిచిన పనులింకా ఉన్నాయి. ఆలయంలో అర్చనలు చేయించాలి, సత్రంలో బసచేసే యాత్రికులకు భోజన సౌకర్యాలు కలిగించాలి. సత్రంలో ఒక వేద పాఠశాలా, ఒక వైద్యశాలా ఏర్పాటుచేయాలి. ఊళ్లో పిల్లలకు ఒక బడి ఏర్పాటుచేయాలి. వీటన్నిటికీ డబ్బు కావాలి. అయితే శీలయాజికి ముష్టెత్తటం ఇష్టం లేకపోయింది. అందుచేత ఆయన సత్రంలో ఒక దిబ్బెమూ, గుడిలో మరొక దిబ్బెమూ ఏర్పాటు చేయించాడు. సత్రానికి వచ్చిన యాత్రికులూ, గుడికి రోజూ వెళ్లే భక్తులూ తమకు తోచినది తమంతట తామే ఆ దిబ్బాలలో వేసి పోతూండేవారు.

గుడి కట్టించిన వేళ మంచిది. ఆ ఆలయంలో ఉండే శ్రీ రామ చంద్ర మూర్తి కరుణా కటాక్షంవల్ల ఆ దేవుడికి మొక్కుకున్నవారికి చాలామందికి కోరిక లీడేరటం జరిగింది. ఆలయం ఖ్యాతి పెరిగినకొద్దీ సత్రంలో యాత్రికుల సంఖ్యా, దిబ్బాలలో



పడే మొత్తాలూ పెరిగాయి. అయితే వాటితో బాటు ఖర్చుకూడా పెరిగింది. శీలయాజి తాను చేయదలిచిన సత్కార్యాలన్నీ చేయ లేకుండా ఉన్నాడు. "ఏమండీ, శీలయాజి గారూ, వేదపాఠశాల ఎప్పుడు ఆరంభిస్తారు? వైద్యశాల ఇంకా ప్రారంభించ లేదేం?" అని ఎవరన్నా అడిగితే, ఆయన, "ఏం చేసేది? ఇంకా ఆ రాముడికి దయకలగ లేదు మరి!" అనేవాడు.

ఇంతలో ఒకరోజు గుడి దిబ్బెంలో ఎవరో అయిదువేల వరహాలు పసుపుగుడ్డలో మూటగట్టి పడేశారు. అది చూసి శీలయాజి దిగ్భ్రమ చెందాడు. అభయగిరి గ్రామంలో



కొద్దిమంది ధనికులున్నారు. వారు వందా, రెండు వందలూ ఇవ్వటంకద్దు. అంత పెద్ద మొత్తాలు ఇవ్వదలిచినప్పుడు వారు నేరుగా శీలయాజికే తెచ్చి ఇచ్చేవారుగాని, డిబ్బెంలో వేసి తాము రహస్యంగా వుండటం ఎన్నడూ జరగలేదు. అయిదు వేలు తెచ్చి డిబ్బెంలో ఎవరు వేసినట్టు? వాళ్ళు రహస్యంగా ఉండటానికి కారణం ఏమిటి?

వాళ్లు రహస్యంగా ఉండదలిస్తే తాను వారినిగురించి ఆచోకీతీయటం బాగుండదని శీలయాజి ఈ డబ్బుగురించి ఎవరికీ చెప్ప లేదు. ఆ అయిదు వేలూ గుడి డిబ్బెంలో పడింది గనక దాన్ని ఆయన గుడికే విని యోగించ దలిచాడు. అందులో కొంత అర్చకుడి ఇంటి మరమ్మత్తులకు ఖర్చు చేసి, మిగతాది పెట్టి స్వామివారికి చిన్న బంగారు తొడుగు చేయించాడు. స్వామి వారిని చూసి సంతోషించనివారు లేరు.

మరి కొంతకాలం గడిచాక సత్రం డిబ్బెంలో రెండువేల వరహాల మూట కన బడింది. శీలయాజి ఆశ్చర్యం రెట్టిం పయింది. ఊళ్ళో ఎవరో ఇంత డబ్బు తన కిస్తున్నారు. కాని ఎవరయిందీ తెలియక పోవటంచేత శీలయాజి తన కృతజ్ఞత తెలుపుకోవటానికికూడా చాతగాని స్థితిలో ఉండి పోయాడు.

వేదపాఠశాల ఆరంభమయింది. ఊళ్ళో అందరూ శీలయాజిని మెచ్చుకుని వెళ్ళి పోయారు. తనతో మాట్లాడిన వారందరినీ శీలయాజి శ్రద్ధగా పరికించాడు. కాని ఒక్కరిమీదా అనుమానం పోలేదు. ఒక వేళ ఆ రాముడే తనకీ డబ్బు ఇస్తున్నాడా అనికూడా ఆయనకు అనుమానం కలిగింది. ఆ విధంగా ఆలోచించినకొద్దీ ఇదే నిజమే నేమో ననిపించింది.

రాముడు ఏ రూపంలో వచ్చి తనకి డబ్బు ఇస్తున్నాడో చూడాలనీ, ఏ రూపంలో నైనా ఆ దేవుణ్ణి కళ్ళారా చూసి తరించా

లనీ శీలయాజికి తీవ్రమైన కోరిక కలిగింది. అందుచేత ఆయన రాత్రివేళలప్పుడు తన ఇంటి కిటికీ దగ్గిర మేలుకుని కూచుని సత్రం ఆవరణలోకీ గుడి ఆవరణలోకీ చూడసాగాడు.

ఒక నెల గడిచింది. ఏమీ వింత జరగ లేదు. తాను చూస్తుండగా భగవంతుడు రాడని శీలయాజి ఆశాభంగం చెందసాగాడు. కాని ఇంతలోనే ఒక రాత్రి ఆయన ఎదురు చూస్తున్న దృశ్యం కంటబడింది. చీకటిలో ఎవరో సత్రంకేసి వెళ్ళారు. ఆ మనిషి చేతిలో ఒక మూట ఉన్నది. ఆ మనిషి దిబ్బెందగ్గిరికి వెళ్లి, అటూ ఇటూ చూసి, మూటను దిబ్బెంలో పడేసి గబగబా అక్కడి నించి వెళ్లిపోయాడు.

శీలయాజి ఆ మనిషిని గుర్తించగలి గాడు. వాడు గూడెంలో ఉండే దొంగ రాముడు! శీలయాజి గుండె దడదడా కొట్టుకున్నది. ఆయన చప్పున బయటికి వచ్చి, రాముణ్ణి వెంబడించ సాగాడు. ఊరు దాటి గూడెం సమీపానికి వచ్చేసరికి, శీలయాజి, "ఒరే రాముడూ, ఆగు!" అంటూ పెద్దగా కేకవేశాడు.

రాముడు ఆగి, "తమరా, బాబయ్యా? దండాలండి!" అన్నాడు.



"నువు దిబ్బెంలో డబ్బు వెయ్యటం చూశాను! ఎక్కడిది నీకా డబ్బు?" అని శీలయాజి రాముణ్ణి నిలవదీసి అడిగాడు.

మొదట వాడు తనకేమీ తెలియదన్నాడు గాని, చివరకు ఆ డబ్బు తాను దొంగిలించి నట్టు ఒప్పుకున్నాడు. "బాబూ, రెండు నెల్లకిందట పిల్లిశెట్టిగారింట పదివేలు దొంగి లించాను, బాబూ! వారికేం? చాలా డబ్బున్నది. ఖర్చు తక్కువ. పిసినిగొట్టు. మీవంటివారు మంచి పనులు చేస్తామంటే ఇవ్వరు. ఇంత డబ్బు నేనుమాత్రం ఏం చేసుకోను, బాబూ? అందుకని అప్పుడు కాస్తా, అప్పుడు కాస్తా దిబ్బెంలో వేశాను.

పుణ్యం వుంటుంది, నన్ను బయటపెట్ట కండి, బాబూ!" అన్నాడు రాముడు.

"నువు మహా పాతకుడివిరా! దొంగతనం చెయ్యటం ఒక తప్పు. ఆ పాపిష్టి సొమ్ము తీసుకువచ్చి పవిత్రమైన దిబ్బెంలో వెయ్యటం ఇంకో తప్పు! ఆ డబ్బుతో స్వామివారికి తొడుగు చేయించాను! వేద పాఠశాల పెట్టించాను! అపచారం! చచ్చి నరకానికి పోతాను! దీనికేవన్నా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి! అంటరాని డబ్బు!" అని శీలయాజి విలవిలలాడాడు.

"అంతపని చెయ్యకండి, బాబూ! మధ్యన డబ్బెంచేసింది? పాపం చేసిన వాణ్ణి నేను! డబ్బు నాదికాదుగద, పిల్లి సెట్టిగారిది కద!" అన్నాడు అంటరాని రాముడు వణికిపోతూ.

"అన్నట్టు, ఆ పిల్లిసెట్టి దగ్గిర అంత డబ్బుందా? పదివేలు నువ్వెత్తుకుపోతే మాటమాత్రం పైకి పొక్కక, తేలు కుట్టిన దొంగల్లే ఊరుకున్నాడే?" అన్నాడు శీలయాజి ఆశ్చర్యంగా.

"లక్ష వరహాల నగదున్నది, బాబూ! పదివేలు పోయిందని చెబితే, మిగిలింది దక్కనిస్తారా, బాబూ? దొంగలన్నా కొడతారు, రాజుగారన్నా కాజేసుకు పోతాడు. అందుచేత ఉలక్కుండా ఉన్నాడు పిల్లి



సెట్టి! మీరూ యీ సంగతి బయటపెట్ట కండి, బాబూ," అన్నాడు రాముడు.

"పిల్లిసెట్టితో అంతా చెప్పేస్తాను. నీ దిక్కుమాలిన డబ్బుమూలాన నేను నరకానికి పోలేను," అన్నాడు శీలయాజి.

"బాబ్బాబు! దిబ్బెంలో రెండువేలు వేశాను. ధర్మవైద్యశాల పెట్టించండి. నన్ను కాపాడండి. పిల్లిసెట్టికి లేని విచారం మీకెందుకు? దేవుడికి బంగారపు తొడుగు వేస్తే కళ్ళపండగ్గా ఉందిట. పాపిష్టివాణ్ణి చూసే యోగ్యతలేదు!" అన్నాడు రాముడు.

"నాకు మతిపోతున్నది. నాకేమీ ఆలోచన పోవటం లేదు. ఏం చెయ్యాలో ఆలోచించాలి. నువు వెళ్ళు!" అంటూ శీలయాజి ఇంటికి తిరిగి వచ్చాడు.

తెల్లవారగానే ఆయన గుడికి వెళ్ళి పూజారితో, "ఆ తొడుగు తీసెయ్యి," అన్నాడు విగ్రహాన్ని చూపిస్తూ.

"ఎందుకు, బాబూ?" అన్నాడు పూజారి ఆశ్చర్యంగా.

"దొంగలు ఎత్తుకుపోతారేమో! ఎందుకైనా మంచిది. మా ఇంట్లో దాస్తాను!" అన్నాడు శీలయాజి.

పూజారి నవ్వి, "మన ఊళ్ళో దొంగతనమన్నది లేదే? మీకు అకస్మాత్తుగా ఎందుకు అనుమానం తగిలిందీ? అయినా





దేవుడి సొమ్ము తినేవాడుంటాడా ఎక్కడైనా?" అన్నాడు.

శీలయాజికి ఏం చెయ్యటానికీ పాలుపోలేదు. దిబ్బెంలో అంటరానివాడు వేసిన మూటకూడా ఉన్నది. "నేను మహాపాపిని! అందుకే నన్ను ఆ రామచంద్రమూర్తి ఈ పరీక్షకు పెట్టాడు!" అనుకున్నాడాయన. ఆలయం మైలపడింది, సత్రం మైలపడింది. వేదపఠనం వినపడ్డప్పుడల్లా శీలయాజికి కంపరం ఎత్తేది. దిబ్బెంలో ఉన్న డబ్బుతో వైద్యశాల ప్రారంభించవచ్చు. కాని ఏం చెయ్యటానికీ శీలయాజికి మతి మతిలో లేదు.



వారాలూ నెలలూ జరిగాయి. ఇంతలో పిల్లిసెట్టి చావు బతుకుల్లో ఉన్నట్టు వార్త వచ్చింది. ఆయన కాస్తా చచ్చిపోతే ఆయనకు అంటరాని రాముడు చేసిన మోసం గురించి చెప్పే అవకాశం కాస్తా చెయిజారిపోతుందని, శీలయాజి పిల్లిసెట్టి యింటికి పరిగెత్తాడు. అతడు ఆ యిల్లు చేరేసరికి, పిల్లిసెట్టి చావు బతుకుల మధ్య వూగిసలాడు తున్నాడు.

"ఒక్క పొరపాటు జరిగింది. కొంత కాలం క్రితం మీ ఇంటో ఒకడు దొంగతనం చేసిపోయాడు. వాడు కాజేసిన సొమ్ము పది వేల వరహాలని తెలిసింది. అందులో వాడు తొమ్మిదివేలు గుడికీ, సత్రానికీ యిచ్చాడు. అది ఖర్చు అయిపోయాకగాని నాకీ సంగతి తెలియలేదు. దాన్ని తిరిగి మీకిచ్చే శక్తి నాకు లేదు. అందుచేత దాన్ని మీరిచ్చిన దానంగానే భావించటానికి అనుమతి ఇవ్వండి!" అన్నాడు శీలయాజి పిల్లిసెట్టితో.

పిల్లిసెట్టి గొప్ప లోభి, పిల్లికి బిచ్చం పెట్టేవాడు కాడని అందరూ అనేవారు. అందుకే ఆయనను అందరూ పిల్లిసెట్టి అని పిలిచే వాళ్లు. కాని ఆఖరు క్షణంలో ఆయనకు డబ్బుమీద ఏ విధమైన భ్రాంతి, లేకుండాపోయింది.







"లక్షవరహాలు కూడబెట్టాను. నేను తినలేదు, ఇంకొకరికి పెట్టలేదు. మీరిన్ని ధర్మకార్యాలు చేస్తూంటే ఒక్క రోలీ ఇవ్వకపోయాను, పాపాత్ముణ్ణి! ఆ దొంగ నాకంటె ఎంత మంచివాడు! ఎంత పుణ్యాత్ముడు! పదివేలు దొంగతనంచేసి అందులో తొమ్మిది వేలు ధర్మకార్యాలకోసం మీకిచ్చాడు!" అన్నాడు పిల్లిసెట్టి.

"దొంగను పుణ్యాత్ముడంటా రేమిటి?" అన్నాడు శీలయాజి.

"నేనూ దొంగనే. నేను ఒక వర్తకుడి దగ్గిర గుమస్తాగా ఉండేవాణ్ణి. ఒకనాడు సముద్ర వ్యాపారంమీద నన్నుకూడా వెంట పెట్టుకు వెళ్లాడు. ఒకదేశంలో ఆయనకు జబ్బుచేసింది. ఆయన బతకడని భయపడి ఆయన సొత్తు ముప్ఫైవేల వరహాలతో సహా నేను పారిపోయి వచ్చాను. ఆ డబ్బుతో ఈ గ్రామంచేరి వర్తకంచేసి చాలా డబ్బు సంపాదించాను. లాభం వచ్చినప్పుడల్లా నష్టం వచ్చిందని విలపించేవాణ్ణి. నదిలో ఏ పడవ మునిగినా అందులో నా సరుకు పోయిందని శోకాలుపెట్టేవాణ్ణి. నేను లక్షాధికారినని ఎవరూ ఎరగరు—ఆ దొంగకు తెలిస్తే తెలియాలి!....బాబూ, ఆ దొంగలాగే నేనుకూడా నేను దొంగిలించిన ముప్ఫైవేలూ మీ కిచ్చేస్తాను. పుణ్యకార్యాలకు వినియోగించండి!" అంటూ పిల్లిసెట్టి నౌకర్ల చేత డబ్బు సంచులు తెప్పించి శీలయాజికి ఇప్పించాడు.

శీలయాజికి పరమానందమయింది. ఆయన డబ్బుతో ఇంటికి వచ్చేశాడు. అంటరాని రాముడిని గురించి ఆయన మనసులో ఇంకా బాధ ఉండనే ఉన్నది. ఆయనకు అకస్మాత్తుగా ఒక గొప్ప ఆలోచన తట్టింది. ఆయన ఆ రాత్రి రాముడికోసం కబురు పంపాడు. రాముడు వచ్చాడు.

"ఒరే, నీ పాపం ఒకటి విరగడ అయిపోయింది. తనవద్ద పదివేలు దొంగతనం

చేసినవాణ్ణి పిల్లిసెట్టి క్షమించేశాడు. కాని నీ రెండో పాపానికి నువు నరకంలో అనుభవించి తీరాలి. అయితే ఆ పాపంలో నేను వంతు పంచుకునే మాటకల్ల! ఇదుగో, నీ తొమ్మిదివేల వరహాలూ నువు పుచ్చుకో!" అన్నాడు శీలయాజి అంటరాని రాముడితో.

"పాపిష్టివాణ్ణి, ఈ డబ్బుతో నేనేం పుణ్యకార్యాలు చెయ్యగలను, బాబూ! మీ చేతిమీదిగానే ఇదికూడా మంచి పనులకు ఖర్చు చెయ్యండి!" అన్నాడు రాముడు.

"అది ఎంతమాత్రం కుదరదు. వెంటనే నీ డబ్బు నువు పట్టుకుపోకపోయావో, రాజుగారివద్దకువెళ్ళి నీ సంగతి బయటపెట్టేస్తాను!" అని శీలయాజి కేకలువేశాడు.

రాముడు డబ్బు తీసుకుని, తల వంచుకుని వెళ్ళిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక చిన్న సందేహం? శీలయాజీ, అంటరాని రాముడూ, పిల్లిసెట్టీ—ఈ ముగ్గురిలో ఎవరు ఎక్కువ పుణ్యాత్ములు? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల వెయ్యి వక్కలవుతుంది!" అన్నాడు.

"శీలయాజి పుణ్యకార్యాలు చేశాడేగాని, ఆయనకు పాప భయమూ, పాపచింతా జాస్తి. అంటరాని రాముడు పాపకార్యాలే చేసినా, అతడికి పుణ్యంమీద ఆసక్తి జాస్తి. తాను అడుగుపెట్టటానికి వీలులేని గుడికీ, తాను చెవుల వినటానికి అధికారంలేని వేదపఠనానికీ వాడు సహాయపడ్డాడు. వాడు పుణ్యాత్ముడని గ్రహించగలిగినవాడు పిల్లిసెట్టి. అందుచేత పిల్లిసెట్టికూడా శీలయాజికన్న ఎక్కువ పుణ్యాత్ముడు. అయితే అంటరాని రాముణ్ణిచూసి నేర్చుకున్నవాడు కావటంచేత, సెట్టి రాముడంత పుణ్యాత్ముడుకాడు," అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# మిత్రభేదం

దమనకు డంతట - తనమిత్రుతోడ
విమల బుద్ధిని కథ - విన్పింప దొడగె.
జనము లేనట్టి తా-వున మఠ మొకటి.
మును దేవశర్మ యం-దున నివసించు.
వారు వీరిచ్చిన - వస్త్రమ్ము లమ్మి
చేరిచె రొక్క మా-దారి సన్యాసి
పవలు రాతిరి విడు-వక రొక్క మెల్ల
ఎవని నమ్మక చంక-నే కట్టి యుండె.
ధనమన్న దెప్పుడు - మనిషి వేధించు
ధనము సంపాదించు - వనరు కష్టమ్ము
ధనము రక్షించెడు - వనరు కష్టమ్ము
ధనము వచ్చిన పోయి-నను బాధలుండు.
ఇట్లుండ సన్యాసి - యీ రీతి జూచి
ఎట్లైన ధనము హ-రింపంగ నెంచి
అటకు వచ్చె నొకండు - ఆషాఢభూతి
నటనలో పేరంది-నట్టి వంచకుడు
సాష్టాంగ పడి దేవ-శర్మకు మ్రొక్కి
కష్ట మీ సంసార-కానన మ్మనియె
తనకు మోక్షము వచ్చు - దారి కావలయు
నని గురుచరణమ్ము-లను విడడయ్యె.
ఆషాఢభూతి స-త్యము చెప్పె ననుచు
భేష భేషని మెచ్చె - పెద్ద సన్యాసి,
"వయసులో శాంతుడై - పఱలుటే గొప్ప
వయసు పోయిన శాంతి - వద్దన్న వచ్చు,
మంచి వారికి దేహ - మట్టు లే యుండ
ముంచుక వచ్చును - ముదిమి చిత్తమున
చెడ్డ వారికి ఒడల్ - చెందును ముదిమి
ఎడ్డె మనస్సెపు - ఎదుగ దెన్నటికి"
అని దేవశర్మ ఆ-తని మెచ్చుకొనుచు
విను మోక్ష మార్గము - వినిపింతు ననియె
నిను శిష్యునిగ చేసు-కొనుదును లెమ్ము
ఘన మంత్ర ముపదేశ-మును సేతు ననియె
ఉపదేశ మిచ్చి మ-ఠోపాంతమందె
ఎపుడు వసింప గా-వించె పూరిల్లు
యతులు నిస్సంగులో-యన్న, ఒంటరిగ
బ్రతుక గావలె రాత్రి - పడినంత నెపుడు

విద్వాన్ విశ్వం



అని వాని నా మఠ-మందు రా నీక
పనివినుమను రాత్రి - పడిన వెంబడినె.
సందు చిక్కదు దేవ-శర్మ ధనమ్ము
కొంద మెట్లని వాడు - కుందుచు నుండె
ఒకనాడు పొరుగూరి - యొక శిష్యునింట
ఒక కార్యమని పిల్వ - నిక దేవశర్మ
అరుగ సాగెను; వెంట - ఆషాఢభూతి
తరుణ మిదేయని - తను గూడ నడిచె.
ఏ రొకటడ్డ మ-య్యెను వారి కంత
తీరమ్మునన్ బాట-సారులు దిగిరి.
గురువు రొక్కము కూరి - కుట్టిన సంచి
చరచర బొంతలో - చక్కగా దూర్చి
తీరమందుంచి అ-దే చూచుకొనుచు
వారిని వార్చి, ఎ-ప్పటి యట్లె బొంత



ఉండుట చూచి, శి-ష్యుని నమ్మి వేసి
కొండొక దూర మా - గురువు చన్నాడు.
శంకానివృత్తి కై - చనుచున్న గురువు
వంకలో దిగి కన-పడకున్న జూచి
ఆషాఢభూతి అ-త్యంత వేగముగ
భోషాణపుం బొంత - బుడబుడ విప్పి
చిన్న రొక్కపు సంచి - చేతను బట్టి
ఉన్నవా డున్నట్టె - ఊరికి నాడెటకొ.
మేక పోతులు రెండు - మెక్కి పోట్లాట
డీ కొనుచుండ వా-టిని చూచుకొనుచు
గురువు గారచ్చట - మఱచిరి తన్ను.
సరి మేకపోరులో - వఱలె మనస్సు
అవి రెండు నటునిటు - లల్లంత సరిగి
తివిరి ముందుకు వచ్చి - ఢీ కొట్టుచుండె
నడుమ రక్తము కారి - తడిసెను నేల,
దడదడ నట వచ్చె - బడుగు నక్కొకటి;
అటునిటు మేక లొ-య్యన చనినప్డు
తటుకున నడుమ ర-క్తము నాకు చుండె
అయ్యొ పాపము చచ్చు - నది తప్పకనుచు
నయ్యగారను కొను-నంతలో జరిగె.
మేక పోతులు రెండు - మీరి ఢీ కొట్టె
చీకాకు వడి నక్క - చెచ్చెర జచ్చె.
అది చూచి గురువు కా-ల్యములను దీర్చి
పదపడి శిష్యుని - పరికింప సాగె
తన శిష్యు డెచటికో - తరలియే పోయె
తన బొంత మా-త్ర మాయన చూచి నిలిచె







లోన జూడగ డబ్బు - లున్నట్టి సంచి
అనవాలే లేదు; - అషాఢభూతి
చుట్టి చంకను బెట్టి - సులువుగా నరిగె
ఇట్టటు చూడక - యెటు లేగినాడొ!
కొంప తీసితివిరా - క్రూరుడా అనుచు
కంపర మెత్తి ఆ - కపటిని తిట్టె
తిట్టుచు నేల పై - దెరలి దొర్లుచును
కొట్టు కొంచును గోలు-గోలున ఏడ్చె.
అటు గాన, కరటకా, - ఇటు చేసుకొన్న
కటుకార్యఫలము నే-గతి తప్ప దనుట.

కరటకుడు :

ఎదురు తిర్గిన యట్టి-యెడ మనమెట్లు
కుదురుకో వలయునో - అది చూడవలయు.

దమనకుడు :

తరుణ మిట్టిది యైన - ధైర్యము కలదు;
తఱి చూచి వీరల - పరిమార్చవలయు
సంజీవకుని మైత్రి - భంజించి, రాజు
పంజరమ్మున చిల్క - పగిది బంధింతు.
మాయతో నీపని - చేయం గలాడ
సాయ ముండుము చాలు; - సమ్మతి నిమ్ము

కరటకుడు :

నీ మాయ రాజు గా-నీ, వాడు గాని
ఏ మాత్ర మెఱిగిన - నిక కొంప మునుగు.

దమనకుడు :

భయపడినక్లైన - ఫలము లేదన్న;
జయము కల్గును గుండె - చలియింపకున్న
పడవ సంద్రమ్ములో - భగ్నమే యయిన,
జడియు నాబెస్త, త-మ్ముడ! ఈదుగాక?
ప్రార్థించుటలు మాని - పనిసేయు మయ్య
సార్థకమ్మైన వి-శ్వాసమ్ము తోడ
యత్నమ్ము సేయ, నా - యత్నము వ్యర్థ
యత్నమైనను సరే - అది తప్పుకాదు.
కను గప్పి పనిసేయ-గల మాయదారి
కని పెట్టగా బ్రహ్మ-కైన శక్యంబె?
మునుపు సాలెయొకండు - తను విష్ణురూప
మున రాకుమారి చ-య్యన పెండ్లియాడె.

కరటకుడు :

అ సాలె ఎవ్వడు? - అకథ యేమి?
కాసంత చెప్పు మా-కథ చెలికాడ?








# వింత చికిత్స

ఒక నగరంవెలపల ఒక పాడుబడిన దేవళం ఉండేది. ఒక పేద బ్రాహ్మడు ఆ దేవళానికి పూజారి అయి తన పొట్ట పోసుకుందా మనుకున్నాడు. అయితే ఆ దేవళానికి నూటికీ కోటికీ ఒకరుమాత్రమే వస్తూండటంవల్ల దేవుడితోబాటు పూజారి కూడా మాడటం జరిగింది.

ఆ బ్రాహ్మడు అలాగే ఉపోషాలు చేస్తూ, దేవుణ్ణిమాత్రం వదలక రోజూ పూజచేస్తూ ఉండగా ఒక పౌర్ణమినాడు ఆయన కొక కల వచ్చింది. ఆ కలలో ఈశ్వరుడు కని పించి, "నాయనా, ఈ వూరి రాజును వెళ్ళి చూడు. నీ దరిద్రం తీరిపోతుంది," అని చెప్పాడు.

బ్రాహ్మడు ఆ ప్రకారమే బయలుదేరి రాజభవనానికి వెళ్లాడు. అయితే దురదృష్ట వశాత్తూ ఆ సమయానికి రాజు జబ్బుతో మంచంపట్టి ఉన్నాడు. రాజభటులు వైద్యులను తప్ప మరెవ్వరినీ రాజగృహంలోకి పోనివ్వటంలేదు.

"ఈ సంగతి తెలియకుండా నే ఈశ్వరుడు నన్ను రాజును చూడమని ఉంటాడా?" అనుకుని బ్రాహ్మడు రాజ భటులతో, "నేనూ ఒక వైద్యుణ్ణే. నన్ను లోపలికి పోనివ్వండి!" అన్నాడు. వారాయ నను లోపలికి పోనిచ్చారు.

కాని రాజుగారుండే గదిలోకి వెళ్ళటా నికి ఇంకొక ప్రతిబంధకం ఏర్పడింది. అదేమంటే, రాజుగారు వైద్యులతో విసిగి వేసారిపోయి, తనకు వైద్యంచేసి రోగం కుదర్చలేని వైద్యులకు జన్మఖైదు శిక్ష విధిస్తానని ప్రకటించాడు.

ఇందుకుకూడా బ్రాహ్మడు జంకలేదు. నిండా మునిగినవాడికి చలి ఏమిటి? జన్మ ఖైదు శిక్షకు తల ఒగ్గి బ్రాహ్మడు రాజు గారికి చికిత్స చేస్తానన్నాడు. ఆయనను

ఎం. రామేశ్వరరావు



రాజువద్దకు తీసుకుపోయారు. ఆయన రాజు కెదురుగా చేతులు కట్టుకు నిలబడి, రోగం తాలూకు వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. రాజు చెప్పేదంతా వింటే బ్రాహ్మడికి, రాజుకు రోగమే ఉన్నట్టు తోచలేదు. రోగం ఉందనుకుని రాజుగారు పడక వేశాడు.



రోగంగురించి ఆలోచిస్తున్నవాడిలాగా బ్రాహ్మడు దీర్ఘంగా ఆలోచించి, రాజుగారి రోగం కుదర్చటానికి ఒక ఉపాయం కని పెట్టాడు. ఆయన చిట్టచివరకు మూడు సార్లు తల ఆడించి, "మహారాజా, మీ వ్యాధికి దివ్యమైన మందున్నది. దాన్ని తమరు నేను చెప్పిన పద్ధతిలో మూడు పూటలు సేవిస్తే వ్యాధి పూర్తిగా నిలిచి పోతుంది," అన్నాడు.

రాజు ఆత్రంగా, "చెప్పు! ఎలా చెయ్యమంటే అలాగే చేస్తాను!" అన్నాడు.

"నేనొక కషాయం ఇస్తాను. దానిని రాణీగారు స్వయంగా మీ నోట్లో పొయ్యాలి. మూడు ఉద్ధరిణెల కషాయం మీరు తాగాలి. అయితే మీ నోట్లో కషాయం పోసేటప్పుడు రాణిగారున్నూ, దాన్ని తాగేటప్పుడు మీరున్నూ ఏనుగులను గురించిగాని, గుర్రాలను గురించిగాని ఆలోచించగూడదు. అలా ఆలోచిస్తే మందు ఎంతమాత్రమూ పనిచెయ్యదు," అన్నాడు బ్రాహ్మడు.

రాజు నవ్వి, "ఇది ఏమంత కఠినమైన పని కాదే! మందు తాగేటప్పుడు ఏనుగులను గురించీ, గుర్రాలను గురించీ ఎందుకాలోచించవలసి వస్తుంది?" అన్నాడు.

మర్నాడు బ్రాహ్మడు ఏదో కషాయం తయారుచేసి పంపాడు. దానిని రాజుగారి నోట పొయ్యటానికి రాణీ వచ్చింది. ఉద్ధరిణెతో కషాయాన్ని రాజుగారి నోట పొయ్యబోతూండగా ఆమెకు ఏదో రథంచప్పుడు వినిపించింది. వెంటనే ఆమెకు గుర్రం జ్ఞాపకం వచ్చింది. ఆమె రాజుగారి నోట్లో

మందు పోయక, "లాభం లేదు. నాకు గుర్రం జ్ఞాపకం వచ్చింది!" అన్నది.

రెండోపూట రాణీ తన నోట్లో మందు పొయ్యబోతూండగా రాజు, "ఉండు, నాకు ఏనుగులు జ్ఞాపకం వచ్చాయి!" అన్నాడు. అది మొదలు రాజుకూ, రాణీకీకూడా మందుపేరు చెబితేనే చాలు గుర్రాలూ, ఏనుగులూ తప్పక జ్ఞాపకం వచ్చేవి.

ఇలా ఒక నెల గడిచాక రాజు బ్రాహ్మణ్ణి పిలిచి, "ఏమయ్యా, ఎప్పుడు నీ మందు తాగుదామన్నా ఏనుగులూ, గుర్రాలూ తప్ప ఇంకేమీ జ్ఞాపకం రావటంలేదు! ఏం చేసేట్టు?" అని అడిగాడు.

"మహారాజా, దీనికి ఒకటే ఉపాయం. మీ ఏనుగులనూ, గుర్రాలనూకూడా ఎవరన్నా మంచి బ్రాహ్మడికి దానం ఇచ్చేయండి!" అన్నాడు బ్రాహ్మడు.

"మళ్ళా ఎవరో ఎందుకు? వాటిని నువే పుచ్చుకో!" అన్నాడు రాజు.

దివాణంలో ఉన్న ఉద్యోగస్తులు ఏనుగులనూ, గుర్రాలనూ జాబితావేశారు. రాజుగారు లేచి కూచుని వాళ్లతోబాటు లెక్కలన్నీ చూశాడు. ఈ పనిలో నిమగ్నుడైపోవటంలో ఆయనకు తన వ్యాధిమాటే జ్ఞాపకం లేకుండా పోయింది.

"ఇంకా దానం పూర్తికాకుండానే రాజుగారి వ్యాధి నయమయింది!" అని అందరూ అనుకున్నారు.

బ్రాహ్మడు రాజుగారి దగ్గిర ఏనుగులూ, గుర్రాలూ దానం పుచ్చుకుని, "అయ్యా, చికిత్స పూర్తి అయింది. ఇక నాకు సెల విప్పించండి!" అన్నాడు. తన వ్యాధి నయమయిందని రాజుగారికికూడా తోచింది. ఆయన బ్రాహ్మడికి అనేక బహుమానాలిచ్చి పంపేశాడు.

బ్రాహ్మడు ఆ డబ్బుతో దేవళం మరమ్మతు చేసి, దేవుడికి నిత్యమూ పూజ చేస్తూ సుఖంగా జీవించాడు.






## 3

[ట్రోయ్‌నగరంలో ఏటా జరిగే స్మారకోత్సవాలు చూడటానికి మోహనుడు వెళ్లాడు. అక్కడ వర్ధనుడికి మోహనుడు తన కుమారుడేనని తెలిసిపోయింది. భువనసుందరి కోసం కామినీదేవతను నిత్యమూ ఆరాధించే మోహనుడు స్పార్టాకు వెళ్ళి, భువనసుందరి భర్త ప్రతాపుడు ఇంటలేని సమయంలో ఆమెను తన ఓడలో ట్రోయ్‌కి తెచ్చి పెళ్ళి చేసుకున్నాడు. భువనసుందరిని ఇచ్చెయ్యమని గ్రీకులు పంపిన రాయబారం విఫలమయింది.]

భువనసుందరిని మంచిగా తిరిగి తెచ్చుకునే ప్రయత్నం విఫలం కాగానే, ప్రతాపుడు గ్రీకు రాకుమారుల కందరికీ కబురు చేశాడు: "భువనసుందరిని వరించి వచ్చినప్పుడు మీరంతా తీసుకున్న ప్రమాణం ప్రకారం ఇప్పుడు మీరందరూ నాకు సాయపడండి." ఈ విధంగా కబురు పంపటమే గాక, ప్రతాపుడు గ్రీసు దేశమంతా పర్యటించి, ఒక్కొక్క రాజ్యానికీ వెళ్లి, ప్రతి రాజునూ కలుసుకుని, వారివారి బలాలతో సహా కదిలి తనపక్షాన యుద్ధానికి రావలసిందిగా కోరాడు.

ఇథాకా రాజైన రూపధరుడివద్దకు ప్రతాపుడూ, అతని అన్న అయిన రారాజూ కలిసి వెళ్లారు. కాని రూపధరుడు ఈ యుద్ధంలో చేరగూడదని అదివరకే నిశ్చయించుకున్నాడు. అందుకు కారణమేమంటే, అతను ట్రోయ్ నగరానికి వెళ్లేపక్షంలో తిరుగుమార్గంలో అతనికి అమానుషమైన కష్టాలన్నీ కలుగుతాయనీ, ఇరవై ఏళ్లదాకా



అతను ఇంటికి తిరిగి రాడనీ అశరీరవాణి ఆతడికి చెప్పింది.

అందుచేత రూపధరుడు యుద్ధంలో చేరకుండా తప్పించుకోవటానికి ఒక దొంగ ఎత్తు వేశాడు. రైతులు ధరించే కుళాయి ఒకటి నెత్తికి పెట్టుకుని, కాడికి ఒక ఎద్దునూ, ఒక గాడిదనూ కట్టి, చాళ్లలో ఉప్పు చల్లుతూ పొలం దున్నసాగాడు. పక్కనే అతని భార్య పద్మముఖి తన చంటి కొడుకును, ధీరమతిని ఎత్తుకుని నిలబడి ఉన్నది.

రూపధరుడు వెర్రివాడుగా నటించటమే గాక, తనకోసం వచ్చిన ప్రతాపశ్లీ,



రారాజునూ గుర్తించనట్టు కూడా నటించాడు. కాని వాళ్లు ఎంతమాత్రమూ మోసపోలేదు; పద్మముఖి చేతిలో ఉన్న చంటి పిల్లవాణ్ణి లాక్కుని, రూపధరుడు దున్నే చాలుకు అడ్డంగా పడుకోబెట్టారు. రూపధరుడు చప్పున తాళ్లు లాగి నాగలిని ఆపాడు. దానితో అతనికి పిచ్చి ఏమీ లేదని రుజువయిపోయింది. అతను చివరకు యుద్ధంలో చేరక తప్పలేదు.

ట్రోయ్‌పై యుద్ధంలో చేరిన వారిలో ఉత్సాహం లేకుండా చేరినవారు లేకపోలేదు. ఒక రాకుమారుడు యాభై ఓడలను పంపుతానని వాగ్దానం చేసి ఒక్క ఓడ మాత్రమే పంపాడు. మిగిలిన నలభై తొమ్మిది ఓడలూ ఆ ఓడలోనే ఉన్నాయి. అవి మట్టితో చేసిన బొమ్మ ఓడలు!

* * *

వ్రజకాయుడనే యువకుడి సహాయం లేకుండా ట్రోయ్ నగరం పట్టుబడదని గ్రీకులు జోస్యంద్వారా తెలుసుకున్నారు. ఇతను తటినీ అనే ఆమెయొక్క ఏడవ కుమారుడు. తన కుమారుడు ప్రపంచంలోకెల్లా గొప్ప యోధుడు కావాలనే ఉద్దేశంతో తటిని అతని మడమను పట్టుకుని స్టిక్స్ నదిలో ముంచింది. ఈ కారణంగా అతని



శరీరం వజ్రకాయమయింది; తల్లి పట్టుకున్న మడమమాత్రం మామూలుగానే ఉండిపోయింది. వజ్రకాయుడు పసిపిల్లవాడుగా ఉన్నప్పుడే వేటాడటంలో, పరిగెత్తటంలో, ధైర్యసాహసాలలో, సంగీతం పాడటంలో సాటిలేనివాడనిపించుకున్నాడు. అతను ఆరవ ఏటనే అడవిపందిని కొట్టాడు. లేళ్ళనూ, దుప్పులనూ వేటాడేటప్పుడతను తన పరుగుతో వాటిని అందుకునేవాడు!




వజ్రకాయుణ్ణి యుద్ధంలోకి ఆహ్వానించటానికి రూపధరుడూ, భూధవుడూ, నవద్యోతుడూ వెళ్ళారు. అయితే, తన కుమారుడు ట్రోయ్‌పైకి యుద్ధానికి వెళితే అతను ప్రాణాలతో తిరిగి రాడని వజ్రకాయుడి తల్లి. తనికి తెలుసును. అందుచేత ఆమె వజ్రకాయుడికి స్త్రీ వేషంవేసి, ఒకానొక రాజుయొక్క అంతఃపురంలో రహస్యంగా ఉంచింది.

వజ్రకాయుడి కోసం వచ్చినవారు రాజభవనంలోని పురుషులందరినీ వెతికారు. వారిలో వజ్రకాయుడు వారికి కనిపించలేదు. అతను స్త్రీ రూపంలో అక్కడే దాగి వుంటాడని రూపధరుడికి సందేహం కలిగింది. అతన్ని బయటపెట్టటానికి రూపధరుడొక యుక్తి చేశాడు. అతను అంతఃపుర స్త్రీలకు అనేక బహుమానాలు తెచ్చాడు. వాటిలో స్త్రీల దుస్తులూ, అలంకారాలూ, ఆభరణాలూ ఉన్నాయి. వాటితోబాటు ఒక బల్లెమూ, డాలూకూడా ఉన్నాయి. ఈ బహుమానాలన్నిటినీ ఒక చోట వేయించి, ఎవరికి కావలిసినది వారు తీసుకోవచ్చునని రూపధరుడు అంతఃపుర స్త్రీలకు కబురు పంపాడు. స్త్రీలు వచ్చి తమకు కావలిసిన వస్తువులు వెతుకుతున్న సమయంలో రాజభవనం వెలపల, రూపధరుడి ఆజ్ఞానుసారం భేరీలు మోగాయి. ఆ చప్పుడు వింటూనే స్త్రీ వేషంలో ఉన్న వజ్రకాయుడు తన స్త్రీ దుస్తులు లాగి పారేసి బల్లెమూ, డాలూ

చేబట్టాడు. వెంటనే అతన్ని రూపధరుడు పోల్చి పట్టుకున్నాడు. వజ్రకాయుడు యుద్ధంలో చేరటానికి సమ్మతించాడు.

* * *

గ్రీకుల నావలు ఔలిస్‌వద్ద అయత్తమై ఉన్నాయి. ఆ సమయంలో క్రీట్‌నుంచి దూతలు వచ్చి ఒక వార్త అందజేశారు. రారాజుతోబాటు తనకుకూడా సేనా నాయకత్వం ఇచ్చిన పక్షాన, తాను నూరు ఓడలతో వచ్చి యుద్ధంలో చేరగలనని క్రీట్ రాజ యిన ప్రభవుడు కబురుచేశాడు. ప్రభవుడు భువనసుందరి స్వయంవరానికి వెళ్లిన రాకుమారులలో ఒకడు. ఆయన గొప్ప అందగాడని ప్రతీతి. ఆయన సూచన ఆమోదించబడింది. ఆయన తన నూరు ఓడలతో కదిలి వచ్చాడు.

యుద్ధానికి బయలుదేరే సమయానికి గ్రీకుపక్షాన గల మహా యోధులలో ఎవరు ఏమేమిటంటే :

సైనిక బలాలన్నిటికీ సర్వసేనాని రారాజు. ఆయన కింద ఉపసేనాపతులు రూపధరుడూ, ప్రబోధుడు, దేవమయుడూనూ. ఓడలన్నిటిపైనా సర్వసేనానాయకత్వం వజ్రకాయుడిది. ఆయన కింద ఉపనాయకులు భూధవుడూ, రక్తవర్ణుడూనూ. పీలస్ రాజయిన నవద్యోతుడు యోధు





లందరిలోకీ వృద్ధుడు, సాటిలేని యుద్ధ నైపుణ్యమూ వివేకమూ గలవాడు. మూడు తరాల ప్రజలను పరిపాలించిన ఈ పితామహుడు ముసలితనంలో కూడా యుద్ధ రంగంలో ప్రచండుడు. రారాజు ఆయన సలహా లేక ఏ పనీ చేసేవాడు కాడు. యుద్ధ సంబంధమైన ఏ సమస్య వచ్చినప్పటికీ నవద్యోతుడి సలహాకూ, రూపధరుడి సలహాకూ వ్యత్యాసం ఉండేది కాదు; ఇద్దరూ ఒకే పద్ధతిలో ఆలోచన చేసేవారు.

అతి రథులుగా పరిగణించదగిన వీరులలో ఒకడు భూధవుడు. ధైర్యంలోనూ, బలంలోనూ, అందంలోనూ వజ్రకాయుడి తరవాత చెప్పుకోదగినవాడు భూధవుడే. అతడికి దేవతలన్నా కూడా లక్ష్యంలేదు. అతను యుద్ధానికి బయలుదేరే సమయంలో పెద్దలు, "నాయనా, యుద్ధరంగాన పరాక్రమం ప్రదర్శించి, దేవతల సహాయంతో విజయలక్ష్మిని వరించు!" అని ఆశీర్వదించారు. అప్పుడతను నిరసనగా, "దేవతల సహాయంతో పిరికిపందలు సయితం విజయలక్ష్మిని వరిస్తారు! నేను దేవతల సహాయం లేకుండానే విజయలక్ష్మిని వరిస్తాను!" అని పలికాడు.

ఉపభూధవుడు భూధవుడికి బంధువు కాడు. బల్లెం విసరటంలో ఉపభూధవుడికి





సాటిగలవారు గ్రీకు సేనలో ఎవరూ లేరు. పరుగులోకూడా అతనిని మించగలవాడు వజ్రకాయు డొక్కడే.

దేవమయుడు భువనసుందరిని ఎంతో ప్రేమించిన వాడు. మోహనుడు ఆమెను ఎత్తుకుపోవటం దేవమయుడికి ప్రత్యేకంగా ఆగ్రహం కలిగించింది. అందుచేత అతను పగతో యుద్ధానికి బయలుదేరాడు.

డిలోస్ రాజయిన ముష్కరుడు గ్రీకు సేనలకు కావాలిసిన ధాన్యాలూ, ఇతర సంబారాలూ సమకూర్చి పెట్టాడు. నౌకలు బయలుదేరె ముందు రారాజు దేవతలను ప్రీతి చెయ్యటానికి అవసరమైన పూజలూ, బలులూ జరిపించాడు. కాంశుకుడు అనే దైవజ్ఞుడు నౌకలకు దారి చెప్పేవాడుగా నియమించబడ్డాడు. నిజానికి కాంశుకుడు సముద్రమార్గా లెరిగినవాడు కాడు. అతను దైవజ్ఞుడు మాత్రమే. అందుచేత గ్రీకు నౌకలు సరిఅయిన మార్గదర్శి లేకుండానే బయలుదేరాయి. ఆ కారణంగా అవి ట్రోయ్ తీరానికి పోవటానికి మారుగా, దక్షిణంగా ఉన్న మీసియా తీరానికి చేరాయి.

గ్రీకు సైనికులు ట్రోయ్ తీరమే చేరామనుకుని నౌకలలోనుంచి దిగి దేశంమీద పడి కొల్లగొట్ట సాగారు. ఈ సంగతి తెలిసి మీసియా రాజు తన బలాలను గ్రీకులపైకి పంపాడు. తరవాత జరిగిన యుద్ధంలో గ్రీకు సైనికులు చావుదెబ్బ తిన్నారు సమయానికి వజ్రకాయుడు వచ్చి మీసియా సైన్యాలను తరిమివెయ్యకపోతే గ్రీకులు పూర్తిగా నిర్మూలమై ఉందురు.

తాము చేరినది ట్రోయ్‌తీరం కావని ఈలోపుగా గ్రీకులు తెలుసుకున్నారు. వారు తిరిగి తమ నౌకలలో బయలుదేరారు. కాని సముద్రంమీద ప్రచండమైన తుఫాను చెలరేగి నౌకలు తలా ఒకదారి అయిపోయాయి. ఆ తరవాత అవి తిరిగి సమావేశం కాలేదు. ఒక్కొక్క గ్రీకు రాకుమా



రుడూ తన నౌకలను తన దేశానికి నడుపుకు పోయాడు. ట్రోయ్‌పై సాగించిన మొదటి దాడి ఈ విధంగా విఫలమై ముగిసింది.

కాని సంవత్సరం తిరగకుండానే గ్రీకు బలాలు ట్రోయ్‌పై యుద్ధానికి మళ్ళీ సమాయత్తపరచబడ్డాయి. చాలా రోజులపాటు గాలి అనుకూలంగా తిరగలేదు. చివరకు దేవతలకు బలులివ్వగా గాలి అనుకూలంగా వీచింది. నౌకలు బయలుదేరాయి. అవి దీర్ఘ ప్రయాణం చేసి లెస్బోస్‌దీవి వద్ద మొదటిసారిగా తీరాన్ని అంటాయి. ఈ దీవిని ఏలే రాజు గ్రీకు వీరులకు ఆతిథ్యం ఇచ్చాడు. అయితే ఈయన తన అతిథులను తనతో మల్లయుద్ధం చెయ్యమని ఆహ్వానించాడు. ఆయన మల్లవిద్యలో ఘటికుడు. గ్రీకుల తరఫున రూపధరుడు ఆయనతో మల్లయుద్ధం చెయ్యటానికి అంగీకరించి, అందులో రాజును చిత్తుగా ఓడించాడు. గ్రీకుల ఆనందానికి మేర లేదు వారి నౌకలు లెస్బోస్‌నుంచి బయలుదేరి కొన్నాళ్ళకు టెనెడోస్‌దీవివద్ద మళ్ళీ తీరం అంటాయి.



టెనెడోస్ దీవికి ట్రోయ్‌నగరం ఇరవై మైళ్ళ లోపు ఉంటుంది. ట్రోయ్ కోట గోడలపైకి ఎక్కితే ఈ దీవి దూరాన సముద్రంలో కనిపిస్తూ ఉంటుంది. మిగిలిన వారందరినీ ఈ దీవిలోనే ఉంచి రూపధరుడూ, భువనసుందరి భర్త అయిన ప్రతాపుడూ, ప్రబోధుడూ ట్రోయ్‌నగరానికి రాయబారం వెళ్ళారు. మంచిగా భువనసుందరిని తమకు వప్పగించమని అడగటమే వారి ఉద్దేశం. అయితే ట్రోయ్ పౌరులు భువనసుందరిని వప్పగించగూడదని ఏనాడో నిశ్చయించారు. గ్రీకుల రాయబారం విఫలం కావటమేగాక, రాయబారులను చంపటానికికూడా యత్నం జరిగింది. కాని, రాయబారులకు ఆతిథ్యం యిచ్చిన గృహస్థు అడ్డుపడి, రాయబారులను



చంపటంకంటె నీచమైన పని ఉండదనీ, అటువంటి పనికి తానెన్నడూ సమ్మతించ ననీ గట్టిగా చెప్పాడు.

అఖరు రాయబారం విఫలం కాగానే గ్రీకు నౌకలు టెనెడోస్ దీవినుంచి కదలి ట్రోయ్ తీరానికి వచ్చాయి. నౌకలు విడిసినచోటికి ట్రోయ్ కోటగోడలు కనిపిస్తాయి. గ్రీకునౌకల రాక కనిపెట్టి ట్రోయ్ పౌరులందరూ నగరం వెలువడి సముద్రతీరానికి వచ్చి, నౌకలమీద రాళ్లవర్షం కురిపించి, వాటిని తిప్పికొట్టాలని యత్నించారు. కాని నౌకలు తీరాన్ని అంటాయి.

అయితే ఇప్పుడొక పెద్దసమస్య వచ్చింది. ట్రోయ్ భూమిమీద ముందుగా ఎవరు అడుగుపెట్టేట్టు? ఈ సమస్యకు కారణమేమంటే, మొట్టమొదటగా ట్రోయ్‌గడ్డ మీద అడుగుపెట్టిన యోధుడు యుద్ధంలో మొట్టమొదటగా మరణిస్తాడని జోస్యం చెప్పబడింది. ఈ జోస్యంలో గ్రీకులందరికీ నమ్మకంకుదిరింది. అందుచేత వజ్రకాయుడివంటి ధైర్యశాలికూడా మొదటగా నౌకనుంచి దిగటానికి జంకాడు.

ఆ పనిచేసిన ధీరుడు చంద్రప్రభుడనే వాడు. అతను నౌకలోనుంచి ఒడ్డుకు దూకుతూనే యుద్ధానికి తలబడి, అనేక మంది శత్రువులను సంహరించాడు. అతనిని వీరసింహుడు చంపేశాడు.

చంద్రప్రభుడి వెనకగా వజ్రకాయుడు నౌకనుంచి దూకాడు. అతని వెనకనే అతని వెంటవచ్చిన సైనికులందరూ దూకారు. వజ్రకాయుడు కొందరు ట్రోజన్ వీరులను చంపినాక మిగిలినవారంతా చెల్లాచెదురుగా నగరంలోకి పారిపోయారు.

ఈలోగా గ్రీకుసైనికులందరూ ఉత్సాహంగా కేకలువేస్తూ, పడవలలోనుంచి ఒడ్డుకు దిగారు. (ఇంకా వుంది)





# అగ్నిపరీక్ష

కాంభోజదేశపు రాజు చిత్రవర్మ. అతను రాజ్యానికి వచ్చికూడా పెళ్లిచేసుకోక, తన కాలాన్ని హెచ్చుగా వేటలో గడుపుతూ రాసాగాడు. అతనికి పెళ్లాడే ఉద్దేశం లేనట్టు గమనించి అతని మంత్రులూ, నగరపు పెద్దలూ, "ప్రభూ, మాకు పట్టమహిషి లేక పోవటం పెద్ద కొరతగా ఉన్నది. కుమారులను కనటం మీ భవిష్యత్తుకు అవసరమైనట్టే, యువరాజు ఉండటం రాజ్యం యొక్క భవిష్యత్తుకుకూడా అవసరమే. అందుచేత మా ప్రార్థన అంగీకరించి తాము వెంటనే వివాహంచేసుకోండి," అని చిత్రవర్మను ప్రార్థించారు.

చిత్రవర్మ కొంతసేపు యోచించి, "మీ మాట కాదనటం నా కిష్టంలేదు. కాని ఒక్క షరతుమీద నేను పెళ్లాడగలను. అదేమిటంటే, నేను నాకు నచ్చిన కన్యను మాత్రమే వివాహమాడతాను. ఆమె కుల గోత్రాలతోనూ, అంతస్థుతోనూ మీకు పని లేదు. అటువంటి ఏర్పాటుకు మీరు సమ్మతించి, నేను పెళ్లాడిన మనిషిని మీరు రాణీగా ఆమోదించే పక్షాన వెంటనే వివాహమాడగలను," అన్నాడు.

ఈ షరతును మంత్రులు మొదలైనవారు సంతోషంగానే ఆమోదించారు. కాని చిత్రవర్మ ఎటువంటి పిల్లను చేసుకోబోతాడో వారు ఊహించలేకపోయారు. రాచనగరును అనుకుని ఒక గ్రామంలో ఒక పేదకాపుకు గుణవతి అనే కుమార్తె ఉన్నది. ఆమె సహజ సౌందర్యవతి. ఏ నగలూ, పట్టు చీరెలూ, అలంకరణలూ లేకుండానే ఆమె ఎంతో అందంగా ఉండేది. ఆ అందానికి తోడు ఆమె స్వభావం శాంతంగా ఉండేది. గుణవతిని చిత్రవర్మ అదివరకే చూసి, తానెప్పటికైనా అటువంటి భార్యనే పెళ్లాడాలని నిశ్చయించుకున్నాడు. కాని తాను

ఎన్. అనసూయ

రాజైన పాపంచేత ఆ పేదకాపు కుమార్తెను పెళ్లాడటానికి లేదు. పెళ్లాడితే మంత్రులూ సామంతులూ తనను కాకులు పొడిచినట్టు పొడుస్తారు. ప్రజలుకూడా ఆమెను తమ రాణీగా స్వీకరించటానికి ఒప్పుకోరు. అందుకే చిత్రవర్మ ఆజన్మ బ్రహ్మచారిగా ఉండ నిశ్చయించాడు.

చిత్రవర్మ పెళ్లికూతురెవరో చెప్పకుండా పెళ్లికి ముహూర్తం పెట్టించి, ప్రయత్నాలన్నీ చేసుకుని, తాను పెళ్లికొడుకై స్నాతకం కూడా పూర్తిచేసి, పురోహితులతో, పరివారంతో, పెళ్లికూతురికి అంతు లేని సారె తీసుకుని గుణవతి తండ్రి ఇంటికి బయలుదేరాడు. పెళ్లికొడుకు పల్లకి పేదకాపు ఇంటి ముందు ఆగగానే అందరూ నిశ్చేష్టులైనారు. పెళ్లి ఇల్లు మండిగానికి పసుపైనా లేదు.

పెళ్లికొడుకు వేషంలో ఉన్న చిత్రవర్మ కాపుఇంట్లో ప్రవేశించి కాపుతో, "మీ అమ్మాయిని పిలు!" అన్నాడు. జంకుతూ, బెదురుతూ గుణవతి వచ్చింది. "నిన్ను పెళ్లాడ వచ్చాను. నీకు సమ్మతమేనా?" అని అడిగాడు చిత్రవర్మ. "నా పూర్వజన్మ సుకృతం!" అన్నది గుణవతి. అప్పటికప్పుడే రాజభటులు పెళ్లివారిల్లు అలంకరించారు. ముత్తయిదువులు గుణవతికి బంగారు జరీబట్టలు కట్టబెట్టి, రత్నాభర





ణాలు తొడిగి, పెళ్లికూతుర్ని చేశారు. సరి అయిన ముహూర్తానికి పురోహితులు చిత్రవర్మకూ గుణవతికీ పెళ్లిచేసేశారు. మాట ఇచ్చిఉన్న కారణంచేత మంత్రి సామంతులెవరూ నోరు మెదపలేదు. పెళ్లి పూర్తి కాగానే చిత్రవర్మ భార్యాసమేతంగా రాజభవనంలో గృహప్రవేశం అయాడు.

పెళ్లయితే జరిగిపోయిందిగాని, జాతి తక్కువ మనిషి తమకు రాణీ అయిందన్న భావం రాజుగారి సిబ్బందిలో అందరికీ ఉన్నది. ప్రజల సంగతి చెప్పనే అక్కర్లేదు. వారికి తమ రాణీపైనా, ఆమెను కోరి పెళ్లాడిన రాజుపైనా తేలికభావం ఏర్పడింది.

కాని చిత్రవర్మ మూఢుడు కాదు. తన రాజ్యంలో ఈ పెళ్లికి ఆమోదించేవారు ఒక్కరుకూడా లేరనీ, ప్రజల మనసు మార్చటం తన ధర్మమనీ అతనికి తెలుసును. ఒకసారి అతను గుణవతితో, "నా భార్యవు కావటంలో నీకు ఈ వైభోగాలు మాత్రమే ఉంటా యనుకోక. రాజుల జీవితం కత్తిమీది సాము. ఏ అపదలైనా ఎదుర్కొవలిసి రావచ్చు. ఆ సంగతి ఆలోచించావా?" అని అడిగాడు.

"స్వామీ, ఈ వైభవాలు నాకవసరం లేదు. మీతో అరణ్యంలో ఉండమన్నా ఉంటాను. మీ కోసం ఏ త్యాగమైనా





చేస్తాను," అన్నది గుణవతి. చిత్రవర్మ ఈ మాటకు లోలోపల సంతోషించాడు గాని, తన సంతోషం భార్యకు తెలియనివ్వలేదు.

కాలక్రమాన గుణవతి ఒక కుమార్తెను కన్నది. చిత్రవర్మ పురిటింట్లోకి వెళ్లి గుణవతితో, "నువ్వు ఆడపిల్లను కన్నావని అందరూ ఆడిపోసుకుంటున్నారు. మగపిల్లవాడైతే కొంతలో కొంత సహించి ఉండేవారేమో!" అన్నాడు. గుణవతి కంట నీరు పెట్టుకుని ఊరుకున్నది.

రేపు బారసాల అనగా ఒక అంతఃపుర భటుడు విచారమైన ముఖంతో గుణవతి వద్దకు వచ్చి, "అమ్మా, రాజుగారి ఉత్తరువయింది. బిడ్డను ఇలా ఇచ్చెయ్యండి. ఆమెను తీసుకుపోయి—" అని పైన ఏమీ చెప్పలేక పోయాడు.

"విచారించకు, నాయనా! యజమాని చెప్పినట్టు నడుచుకోవటం మనందరికీ విధి," అంటూ ఉయ్యాలలోనుంచి తన కుమార్తెను ఎత్తి, ముద్దుపెట్టుకుని, భటుడి చేతి కిస్తూ, "నాయనా, రాజుగారు పిల్లను ఏంచెయ్యమంటారో ఆ పని చేసేవరకూ నా తల్లికి ఏమీ బాధ కలగనీయకు!" అన్నది. భటుడు బావురుమని ఏడిచాడు. గుణవతికి కూడా దుఃఖం ఆగలేదు.

చిత్రవర్మ తన కుమార్తెను రహస్యంగా తన మేనమామలు ఏలే భీమపురికి పంపించేశాడు. అక్కడ ఆ పిల్లను ఏ లోటూ లేకుండా పెంచటానికి తగిన ఏర్పాట్లన్నీ చేశాడు. వీటినిగురించి గుణవతికిగాని, మంత్రిసామంతులకుగాని, కాంభోజదేశపు ప్రజలకుగాని ఏమీ తెలియదు. రాజు తన కుమార్తెను చంపించాడన్న వార్త ఒకటి మటుకు దేశమంతటా పాక్కంది. ఆ అపవాదుతోబాటు ప్రజలలో కొంతవరకు గుణవతిపై సానుభూతి ఏర్పడింది. "రాజుగారు ఆమెను పెళ్లిచేసుకోకుండానే ఉండవలిసింది. పెళ్లిచేసుకున్నాక పిల్లలు పుడితే

చంపుకుంటారా? ఏ పాపమూ ఎరగని ఆ బాలింతరాలికి ఎందుకు వచ్చిన గర్భ శోకం?" అనుకున్నారు ప్రజలు.

మూడు, నాలుగేళ్లు గడిచాయి. గుణవతి మరొకసారి గర్భిణిగా ఉండి, ఈసారి కొడుకును కన్నది. చిత్రవర్మ పురిటింటిలోకి వెళ్లి తన భార్యతో, "నువు కొడుకును కన్నావని ప్రజలు మండిపడుతున్నారు. 'ఈ కాపువాడా మాకు రాజు కాబోయేది?' అని అడుగు తున్నారు," అన్నాడు. గుణవతి గుడ్లనీళ్లు గుక్కుకున్నది. పుట్టిన పదవ నాడు రాజు భటుడిద్వారా తన కుమారుణ్ణి కూడా భార్యవద్దనుంచి తెప్పించి, వాణ్ణి కూడా భీమపురికి పంపేశాడు.

రాజు తన కూతురిలాగే కొడుకునుకూడా చంపేశాడని వార్త పుట్టింది. ఈసారి మంత్రి సామంతులకు సయితం గుణవతిపైన కనికరం కలిగింది. "అచ్చగా కాపు రక్తం గల గుణవతి మహారాణి కాగా లేందీ, సగం క్షత్రియ రక్తం గల కుర్రవాడు రాజెందుకు కాగూడదు? రాజు గుణవతిని పెళ్ళాడకుండానే ఉండవలిసిందిగాని ఆమెకు పుట్టిన కుమారుణ్ణి చంపటం చాలా అక్రమం," అనుకున్నారు మంత్రి సామంతులు.



రెండుసార్లు ఇలా జరిగినప్పటికీ గుణవతి తన కడుపుకోతను తన భర్తవద్దగాని, ఇతరులవద్దగాని బయటపెట్టనే లేదు. ఆమె రాణీగా తన విధులను ఎంతో శ్రద్ధగా నెరవేర్చుతూ రాజసౌధంలో ఎటువంటి అశాంతీ లేకుండా నిర్వహించుతూ రాసాగింది. తన భార్య సహనం చూసి చిత్రవర్మ పొందిన ఆనందం ఇంతా అంతా కాదు. కాని ఆ ఆనందాన్ని పైకి కనబరచలేదు.

మరి నాలుగేళ్ళు గడవనిచ్చి చిత్రవర్మ గుణవతితో, "నేను నిన్ను పెళ్ళాడటం చాలా పొరపాటయింది. నిన్ను తమ రాణీగా ప్రజలు ఒక్కనాటికి ఆమోదించరు. ఎనిమి

వెళ్లు చూశాను. లాభం లేకపోయింది. నిన్ను వదిలేసి ఏ క్షత్రియ కన్యనో పెళ్ళాడదా మనుకుంటున్నాను," అన్నాడు.

"అందులో మీ తప్పేమి ఉన్నది? మీరు ఎంతో దయగలవారు గనక, నేను అనర్హురాలినని తెలిసికూడా ఇంతకాలం ఏలుకున్నారు. మరొకరైతే అప్పుడే నన్ను గెంటివేసి ఉందురు. నన్ను మా తండ్రి ఇంటికి పంపేసి మీకు తగిన భార్యను చేసుకోండి," అన్నది గుణవతి. ఆ రోజే చిత్రవర్మ ఆమెను పేదకాపు ఇంటికి పంపేశాడు. ఆమె తండ్రి ఇంట ఉండి, పెళ్లికి పూర్వంలాగే కసువు ఊడ్చటమూ, పిడకలు చెయ్యటమూ మొదలైన పనులు చెయ్యసాగింది. నిన్నమొన్నటిదాకా పట్టపురాణిగా ఉన్నాను గదా అని ఆమె దురభిమానం ఏ మాత్రమూ చూపలేదు. ప్రజలలో మాత్రం రాజును తిట్టనివారు లేరు.

మరి నాలుగేళ్లు గడిచాయి. చిత్రవర్మ మంత్రిసామంతులను పిలిచి, "నేను మంచిదాన్నిగా చూసి మళ్లీ పెళ్లాడదా మనుకుంటున్నాను. మీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

దానికి వారు, "ప్రభూ, మీరు మీ మొదటి భార్యను వదిలిన దగ్గరనుంచీ అంతఃపురంలో అరాజకమూ, అశాంతీ



హెచ్చాయి. ఆవిడ చాలా సమర్థురాలు. కులగోత్రాలు లేకపోయినా ప్రజలందరి అభిమానమూ సంపాదించుకున్నది. ఎవరిని చూసినా ఆమె పేరు చెప్పి దణ్ణాలు పెట్టే వాళ్లే! ఈసారికూడా మీరు కులగోత్రాలు పాటించక గుణవతి అయిన భార్యను చేసుకోండి. అంతకన్న మేము చెప్పేదిలేదు," అన్నారు. "సరే, మీ యిష్టప్రకారమే చేస్తాను. మంచి ముహూర్తం పెట్టించండి!" అన్నాడు రాజు.

ముహూర్తం నిర్ణయమయింది. చిత్రవర్మ గుణవతిని పిలిపించి, "నేను పెళ్లి చేసుకుందామనుకుంటున్నాను. అందుకు తగిన ఏర్పాట్లు చెయ్యటం నీవల్ల తప్ప మరొకరివల్ల కాదు. అంతఃపురం అన్ని మూలలూ నువ్వెరుగుదువు. నగరంలో పెద్దలందరిని గురించీ నీకు బాగా తెలుసు. అందుచేత నా పెళ్లికి జరగవలిసిన అలంకారాలూ, చెయ్యవలిసిన ఏర్పాట్లూ, పంపవలిసిన ఆహ్వానాలూ మొదలైనవి చూసే పూచీ నీమీద వేస్తున్నాను," అన్నాడు.

"తమ అనుగ్రహం!" అన్నది గుణవతి. ఆమె కడుపులో ఏమి దుఃఖం ఉన్నదో ఎవరికీ తెలియదు. కాని పెళ్లి ఏర్పాట్లు మాత్రం ఒక్క లోపం లేకుండా అద్భుతంగా జరిగాయి. ఈ లోపుగా చిత్రవర్మ తన



కుమార్తెనూ, కుమారుణ్ణీ తన మేనమామల వద్దనుంచి రప్పించటానికి ఏర్పాట్లుచేశాడు. వారు అంచె బోయీల సహాయంతో కాంభోజ దేశం చేరుకున్నారు.

పన్నెండేళ్ల ప్రాయంగల రాజకుమార్తెను చూసి ప్రజలు ఆమే పెళ్లికూతురు కాబోలు ననుకున్నారు. చాలామంది ఈ పిల్లను తమ వెనకటి రాణీతో పోల్చుకుని, "నగలూ, చీరెలూ ధరించగానే సరా? ఆ ఇల్లాలు స్థానం ఈ పిల్ల ఎట్లా ఆక్రమిస్తుంది?" అన్నారు. ప్రజలు పడ్డట్టే గుణవతికూడా పొరపాటుపడింది. ఆమె చిత్రవర్మ దగ్గిరికి పోయి, "ప్రభూ, నేను కష్టాలకు అలవాటు పడినదాన్ని. కాని ఈ పిల్ల సుఖాల మధ్య పెరిగినది. నన్ను చూసినట్టుమాత్రం ఈమెను చూడకండి!" అన్నది.

ఆ సమయానికే మంత్రిసామంతులు రాజువద్దకు వచ్చి, "ప్రభూ, మొదటిసారి మీపెళ్లి విషయంలో మేము జోక్యం కలిగించుకోలేదు. కాని ఈసారి మామాట విని తీరాలి. ముక్కు పచ్చలారని ఈ పిల్లను మీరు వివాహం చేసుకోవటం మాకు సమ్మతంకాదు. ఆమె కింకా చిలిపితనమైనా వదలలేదు," అన్నారు.

చిత్రవర్మ నవ్వుతూ, "మీ రంతా ఏమి టంటున్నారు? ఇవాళ వచ్చిన పిల్ల నా కుమార్తె. ఆమె తమ్ముడు నా కుమారుడు. మీకు తెలియదా?" అన్నాడు.

"మరి పెళ్లికూతు రెక్కడ?" అన్నారు మంత్రులు ఆశ్చర్యంగా.

"ఇదుగో! అంటూ చిత్రవర్మ, ముతక చీరె కట్టుకుని కాపుస్త్రీ అవతారంలో ఉన్న గుణవతిని చూపాడు. మంత్రుల ఆనందానికీ, గుణవతి ఆనందానికీ మేరలేదు. ఆమె పరిగెత్తుకుని పోయి, ఆనందాశ్రువులు రాలుస్తూ తన కుమార్తెనూ, కుమారుణ్ణీ కౌగలించుకున్నది. ఆమె జీవితానికి అగ్ని పరీక్ష అయిపోయింది.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబరు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## డిసెంబరు నెల ఫోటో ఫలితాలు

మొదటి ఫోటో : అక్కయ్య చేతిలో ఆకాశదీపాన్ని...

రెండవ ఫోటో : చక్కనీ మేడెక్కి నిక్కిచూశేను!

పంపినవారు : ఎం. జి. కాంతమ్మ. C/o శ్రీ ఎం. జి. సుబ్బయ్య, ఎం. ఏ., ఎల్. టి., ఆదోని.

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# విదూషకుడి యుక్తి

ఒక రాజుగారివద్ద ఒక విదూషకు ఉండేవాడు. అతను నవ్వు పుట్టించే హాస్యం చేసి రాజుగారిని ఆనందింపచేసి, అనేక బహుమానాలు పొందాడు. రాజుగారికి అతనంటే చాలా ఇష్టం.

ఇలా ఉండగా రాజుగారికి ఒకనాడు విదూషకుడిపైన ఎందుకో కోపం వచ్చింది. ఆ కోపంలో, విదూషకుడి తల తీయించవలసిందిగా ఆజ్ఞ ఇచ్చాడు.

విదూషకుడు రాజుగారి కాళ్లపై పడి తనను క్షమించమని వేడుకున్నాడు.

"నువు చేసిన తప్పుకు మరణదండన తప్పదు. కాని చాలా కాలంగా నాకు వినోదం కల్పించావు గనక, నీకు ఒక్క వరం ఇస్తాను. అదేమంటే, నువు ఏ విధంగా చావగోరుతావో రేపు ఉదయంలోపుగా నాకు చెప్పు. నువు అలాగే చచ్చేటట్టు నేను చూస్తాను!" అన్నాడు రాజు.

మర్నాడు విదూషకుడు రాజుగారివద్దకు వెళ్లి, "మహారాజా, నేను ఎలా చావాలో నిశ్చయించుకున్నాను. ఆ ప్రకారం మరణించేటట్టు నాకు అనుగ్రహించండి," అన్నాడు.

"దానికి నేను సిద్ధంగానే ఉన్నాను. నువు ఎలా చావగోరుతావో చెప్పు," అన్నాడు రాజు.

"మహారాజా, నేను ముసలి తనంలో మంచాన తీసుకుని చావగోరుతున్నాను," అన్నాడు విదూషకుడు.

విధిలేక రాజుగారు విదూషకుణ్ణి చంపక వదిలిపెట్టేశాడు.



# చదువురానివాడు

ఒక గ్రామంలో ఒక పండితుడుండేవాడు. ఆయనకొక కుమార్తె ఉండేది. ఆ పిల్ల సంస్కృతం బాగా చదువుకున్నది. వ్యాకరణంకూడా తెలిసినది.

ఆ పిల్లకు పెళ్లియీడు వచ్చింది. అందుచేత పండితుడు తన కుమార్తెకు తగిన వరుణ్ణి తీసుకువచ్చేటందుకు అనేక గ్రామాలు తిరిగి ఒక గ్రామంలో ఒక బ్రహ్మచారిని చూశాడు. ఆ బ్రహ్మచారి చూపులకు బాగానే ఉన్నాడు, కాని వాడికి చదువు అంటలేదు. శబ్దమంజరిలో రామశబ్దం ఒకటి చదివి, అలిసిపోయి, అంతటితో చదువు కట్టిపెట్టాడు.

పండితుడు ఈ కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని ఇంటికి వచ్చి, "అమ్మాయీ, వీడు నీకు నచ్చుతాడేమో చూడు!" అన్నాడు.

బ్రహ్మచారికి విద్యాగంధం లేదని పండితుడి కూతురు పసికట్టి, "విహస్య, విహాయ, అహం, కథం—ఈ శబ్దాలు ఏయే విభక్తులు గలవి?" అని అతన్ని అడిగింది.

నిజానికి ఇవి విభక్తులు గల మాటలు కావు. 'విహస్య' అంటే 'నవ్వి' అని అర్థం; అలాగే 'విహాయ' అంటే 'విడిచిపెట్టి' అనీ, 'అహం' అంటే 'నేను' అనీ, 'కథం' అంటే 'ఎట్లు' అనీ అర్థం. అయితే చదువురాని బ్రహ్మచారికి ఈ సంగతి తెలీదు.

వాడు రామశబ్దం ఒక్కసారి జ్ఞాపకంచేసుకుని 'రామస్య' లాగే 'విహస్య' షష్ఠీ విభక్తి అనీ, 'రామాయ' లాగే 'విహాయ' చతుర్థీ విభక్తి అనీ, 'రామం' లాగే 'అహం', 'కథం' అనే మాటలు ద్వితీయావిభక్తి అనీ చెప్పేశాడు.

వెంటనే పండితుడి కూతురు ఈ విధంగా చెప్పింది:

> "యస్య షష్ఠీ చతుర్థీస్యాత్, విహస్యచ విహాయచ,
> అహం, కథం ద్వితీయాస్యాత్ ద్వితీయాస్యా మహం కథం?"

[విహస్య, విహాయ అనే పదాలు షష్ఠీ చతుర్థీ విభక్తులనీ, అహం, కథం అనే మాటలు ద్వితీయావిభక్తి అనీ చెప్పేవాడికి ఎలా భార్యనయేది?]

ఈ మాటలు విని బ్రహ్మచారి సిగ్గుపడి తలవంచుకుని వచ్చినదారి పట్టి యింటికివెళ్లాడు.




ప్రొఫెసర్ పి. సి. సర్కార్

ఇప్పుడు వివరించబోయేదాన్ని ఐంద్రజాలికులు "చీనా నాణెముల ఇంద్రజాలం" అంటారు. పాతకాలపు చీనా నాణెముల మధ్య రంధ్రాలుండేవి; అందుచేత ఐంద్రజాలికులు ఈ ట్రిక్కు చేయటానికి ఆనాణెములను ఉపయోగించే వారు.

ఇప్పుడు మనదేశంలోకూడా చిల్లి కానులున్నవిగనుక మనం ఈ ట్రిక్కుకు "చిల్లికానుల ఇంద్రజాలం" అని పేరు పెట్టుకోవచ్చు.

ఐంద్రజాలికుడు అయిదు చిల్లి కానులనూ, ఒక నిడుపైన దారాన్నీ తీసుకుంటాడు. (పైబొమ్మ చూడండి) కొనలు చేర్చి దారాన్ని రెండు పేటలు చేసి, దారపు కొసలను ఒక కానీ రంధ్రంగుండా లాగి, తిరిగి వాటిని దారపు మడతకుండా తీసి, కానీని తాడుతో కట్టివేస్తాడు. ఆ తరువాత దారపు కొసలను మిగిలిన నాలుగు కానుల రంధ్రాలగుండా పోనిచ్చి, వేరుచేసి ఒక్కొక్క కొస వేరు వేరు వ్యక్తులకిచ్చి, లాగి పట్టుకోమంటాడు. (పై బొమ్మ చూడండి.) వారు ఆ కొసలు అ విధంగా లాగి పట్టుకుని ఉండగానే ఐంద్రజాలికుడు కానులపై ఒక చేతి రుమాలు కప్పి, దాని చాటున దారం నుంచి కానులను వేరుచేసేస్తాడు.

ప్రేక్షకులకిది అసంభవంగా కనిపిస్తుంది. ఎందుచేతనంటే, పైన వుండే నాలుగు కానులూ అడుగున ఉండే కానీమీదుగా దూరటానికి అవకాశం

లేదు; వాటి రంధ్రాలకన్న కింది కానీ పెద్దది. కాని, వాస్తవానికి ఇది చాలా సులువైన ట్రిక్కు. కింది బొమ్మ చూసినట్టయితే ఇది బోధపడుతుంది.

రాగానే మిగిలిన కానులు బయటికి వచ్చేస్తాయి. ఆ తరువాత ఐంద్రజాలికుడు కింది కానీని ఎప్పటిలాగే దారానికి తగిలించేస్తాడు.







కానులమీద చేతిరుమాలు కప్పి, కింది కానీని కట్టివున్న దారాన్ని వదులుచేసి ఐంద్రజాలికుడు సులువుగా ఊడదీసేస్తాడు. కింది కానీ దారంనుంచి ఊడి

[పాఠకులు, యీ గారడీని గురించి మరేవైనా సలహాలు పొందదలిస్తే: ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888 కలకత్తా - 12.]



# వార్తలు-విశేషాలు

నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి, మరి 38 లక్షల రూపాయలను అప్పుగా, కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ ప్రాజెక్టుకుగాను, కేంద్రం యింతవరకు అప్పుగా యిచ్చిన మొత్తం 149 లక్షల రూపాయలు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి, మొత్తం 85 కోట్లు ఖర్చు కాగలదని అంచనావేశారు.

*　　　*　　　*　　　*

1956 డిసెంబరు 1వ తేదీలోగా, భారతీయపౌరులుగా తమ పేర్లను నమోదుచేయించుకున్న కాందిశీకులకు, ఓటింగు అధికారాలిస్తూ, రాష్ట్రపతి ఒక ఆర్డినెన్సు ప్రకటించారు.

*　　　*　　　*　　　*

భారతప్రభుత్వం, తనకు అవసరమైన వస్తువులనన్నిటినీ, చిన్నఎత్తు పరిశ్రమలనుంచే కొనటానికి నిర్ణయించింది. దేశంలో దాదాపు 30, 40 వేల వరకు వున్న ఈ చిన్నఎత్తు పరిశ్రమలను ప్రోత్సహించటంకోసం, యీ నిర్ణయం చేయబడింది. గతసంవత్సరంలో ప్రభుత్వం, చిన్నఎత్తు పరిశ్రమలనుంచి 2 కోట్ల 72 లక్షల సరుకు ఖరీదుచేసింది.

*　　　*　　　*　　　*

నవంబర్ 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారంచేసింది. యీ మంత్రివర్గంలో ముఖ్యమంత్రితో కలిపి, ప్రస్తుతం మంత్రుల సంఖ్య పన్నెండు. త్వరలోనే యీ మంత్రివర్గంలో మరికొందరు చేరటంద్వారా, మంత్రివర్గం విస్తరింపబడే అవకాశం వున్నది.



ద్వితీయ పంచవర్షప్రణాళికకింద 8000 మంది యువజననాయకులకు శిక్షణ గరపడానికి, భారత్ సేవక్‌సమాజ్ నిర్ణయించింది. వీరికి, యువజనశిబిరాలను ఏర్పాటుచెయ్యడంలోను, క్రమశిక్షణలోను, జాతీయ నిర్మాణ కార్యకలాపాలలోను, శిక్షణ గరపబడుతుంది.

*　　　*　　　*　　　*

తక్కువ ఆదాయవర్గాలకు చెందిన స్త్రీలకు అద్దె-కొనుగోలు పద్ధతికింద కుట్టుయంత్రాలను సప్లయిచేయడానికి కేంద్రవాణిజ్య పారిశ్రామిక మంత్రి ఒక పథకాన్ని తలపెట్టారు. ఈ పథకం కింద కొంత కృషిజరిగిన తరువాత కుటుంబ సంక్షేమపథకంకింద సహకారసంఘాలు నెలకొల్పబడతాయి.

*　　　*　　　*　　　*

నవంబర్ 14 వ తేదీన ప్రధాని నెహ్రూకు 67 సంవత్సరాలు నిండి, 68 వ సంవత్సరం ప్రారంభమయింది. ఈ శుభసమయంలో ఆయనకు, ప్రపంచం అన్ని ప్రాంతాలనుండీ, అభినందన సందేశాలు వచ్చినై.

*　　　*　　　*　　　*

నవంబరు 1వ తేదీన మనదేశం పునర్విభజింపబడింది. ఇందులో 14 రాష్ట్రాలు, 6 కేంద్రపాలిత ప్రాంతాలు ఉన్నవి. ఈ నూతన రాష్ట్రావతరణ సందర్భంలో.అన్ని ప్రాంతాలా అత్యంత వైభవంగా ఉత్సవాలు జరిగినై.

*　　　*　　　*　　　*

మనదేశంలో తొలిసారిగా హౌరా - ఢిల్లీ జనతా ఎక్స్‌ప్రెస్ బండ్లలో సినిమాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ సినిమా ప్రదర్శనంకోసం నిర్మించిన పెట్టె, ఫిలిములు లేనప్పుడు, టీ, కాఫీ, ఫలహారాలు మొదలైనవి అమ్మేందుకు వినియోగించ బడుతుంది.

*　　　*　　　*　　　*

**1955-56** సంవత్సరాలలో, భారతరైల్వేలు విదేశాలనుంచి దాదాపు 15 కోట్ల 98 లక్షల రూపాయల ఖరీదుచేసే రైల్వే సామగ్రిని దిగుమతి చేసుకున్నాయి. మనదేశంలో వుత్పత్తి అయిన సామగ్రిలో 99 కోట్ల 57 లక్షల రూపాయల సామగ్రి ఖరీదు చేయబడింది.



# చిత్రకథ





స్కూలు వార్షికోత్సవ సహాయనిధికి, చందాలు పోగుచేసేందుకు, దాసూ వాసూలు డబ్బా తీసుకుని బయలుదేరారు. కాని, వాళ్ళు ఎంత ప్రయత్నించినా ఎవరూ చందా యివ్వలేదు. దానితో వాళ్ళు చాలా నిరుత్సాహ పడిపోయారు. వాళ్ళ వాలకం చూసిన 'టైగర్' ఆ డబ్బాను నోట కరుచుకు పారిపోయి, దారిలో కనబడిన వారందరి దగ్గిరకూ వెళ్ళింది. డబ్బాలో ఎవరికి తోచినంత వారు వేశారు. కొద్దిసేపట్లోనే డబ్బా నిండిపోయింది. హెడ్మాష్టరు దాసూ వాసూల సంగతే మరిచిపోయి, 'టైగర్' తెలివితేటలను మాత్రం చాలా మెచ్చుకున్నాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor SRI 'CHAKRAPANI'

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. నకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

చక్కనీ మేడెక్కి నిక్కిచూశేను!

పంపినవారు:
ఎం జి. కాంతమ్మ - ఆదోని

